# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము



సంపుటము 22 డిశంబర్ 1979 సంచిక 12



విషయానుక్రమణిక



—: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతి నిలయమునందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

**చందాదారులు గమనించండి!**

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆనెంబరు "..../-1-1980" అనియుండిన, మీచందా జనవరి నెలతో అయిపోవునని తెలిసికొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) డిశంబర్ నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

12

అట్టివానికి తగిన దేహములు వానికనుకూలమగు లోకములుండి తీరవలెను. అవియే స్వర్గనరకాదులు. జీవత్వము లేదా వ్యక్తిత్వము పదములు ఒక అర్థమునే సూచించును. ఈ వ్యక్తిత్వము లేదా జీవత్వము యొక్క మూలము అవిద్య. అవిద్య గుణత్రయములు కలది అయినను రజోగుణము ప్రాధాన్యముగా గలది. జగత్తుయొక్క యునికియే అవిద్యయొక్క యునికి. గుణసంయోగముల ననుసరించి జీవుడు నానా భేదముల నొందుచున్నాడు. ఈ సంయోగము కర్మ ఫలాధీనము. జీవుడు సత్త్వగుణ ప్రధానుడగునెడల దేవాది భాగవతుడగును. రజోగుణప్రధానుడగుటవలన మానవత్వము పొందును. తమోగుణ ప్రధానుడగుట వలన పశుపక్ష్యాది రూపములనొందును.

జీవుడు తానొక కార్యమనియు ఈశ్వరుడు కారణభూతుడనియు తలంచుటచే కార్యమాయెను. అవిద్య కారణోపాధి అయెను. అవిద్య మూలము. అది ఆత్మవిద్యవలన నిర్మూలింపబడిన యెడల జీవ జగద్భ్రాంతులు నశించును. ఇట్టి అవిద్యా నిర్మూలనార్థము వేదోక్త కర్మకాండ విలసిల్లుచున్నది. అవిద్య ఉండునంతవరకూ జగత్తు జీవత్వము ఊర్ధ్వ అధోలోకాదులు, ధర్మాధర్మములు, కర్మభక్తిజ్ఞానాదులు పరమసత్యములు, అవశ్య ఆచరణీయములై యున్నవి. సత్యత్వ భ్రాంతి యుండినంతవరకూ మానవ కర్మ ఈశ్వర నియతికిలోనై ప్రవర్తిల్లును. జగత్తు భావపదార్థముకాని అభావపదార్థము కాదు. కావున జీవతత్త్వము చక్కగా తెలియనియెడల

బ్రహ్మతత్త్వము గ్రాహ్యము కాదు. ఆకాశము నందు దాని యథార్థతత్త్వము తెలియని వారలచే భ్రాంతివలన పొగ, దుమ్ము మలత్వాదులు, ఆరోపింపబడి యున్నటులనే అవిద్యా ప్రభావమువలన ఆత్మను బుద్ధి ఆది ఉపాధి, విశిష్టునిగను కర్తృత్వ, భోక్తృత్వ, సమన్వితునిగను, సుఖదుఃఖాద్యనుభావునిగను, బంధ మోక్ష సమన్వితునిగను, వ్యవహార సత్యత్వ దృక్పథమునుండి పరమార్థమునకు భిన్నముగ తలంచుట సహజము. జ్ఞానము వలన భ్రాంతి నశించగా యథార్థము గోచరించును. ఆకాశము ఏకముగ నొక్కటై యున్నను ఉపాధుల ననుసరించి గృహాకాశం, ఘటాకాశం, మఠాకాశం, పటాకాశం అను భేదములతో వ్యవహరింపబడు చున్నది. ఇట్లు ఉపాధి కృత భేదములతో వ్యవహరింపబడు చున్నది. కానీ వాస్తవమునకు ఆకాశము నందెట్టి భేదమును లేదు. చెంబు, గృహము, చెరువు, కుండ మొదలగు ఆకారములు నామములు మరియు వానియొక్క ఉపయోగాదులు వేరువేరుగా నున్నను అందుగల ఆకాశమునకు భేదములేక, యేకమై యెటుల నున్నదో ఆ విధముగనే జీవుల యొక్క నామరూపాదులు వ్యవహారములు భిన్న భిన్నముగ నున్నను పూసలలోని దారమువలె చైతన్యము మాత్రము ఏకమైయున్నది. అదియే ఆత్మ అనియు ప్రస్తుతము జీవుడనియు భ్రాంతిలో నున్నట్టి నీవే అట్టి ఆత్మవనియు ఇట్టి జ్ఞానము కలుగ నంతవరకూ సంసారము వదలదనియు శ్రుతి స్పష్టపరచి యథార్థతత్త్వమును ఉపదేశించు చున్నది.

ఏ విషయము తెలిసిన సర్వము తెలియబడ గలదు? ఆత్మను తెలియుము. సర్వము తెలిసిన వాడవగుదువని శ్రుతియే తెలుపుచున్నది. జగత్తు మిథ్యా విషయము. అనృతాంశము. అట్టి దానిని తెలియుటవలన ఎట్టి లాభము కలుగదు. దీనిని తెలిసికొనుట పురుషార్థము కాదు. ఆత్మతత్త్వ జ్ఞానము వలన పురుషార్థ సిద్ధి కలుగునని అనేక విధముల శ్రుతి హెచ్చరించుచున్నది. జగత్తు ఎటుల సృజింపబడినదను అంశము తెలియవలయునని కానీ, లేక దానిని తెలిసికొనుమని కానీ శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాది శాస్త్రములందెచటను బోధించ లేదు. అట్లు తెలిసికొనక పోయినంత మాత్రమున అనర్థములు కలుగునని కూడా తెలియ జేయలేదు. తెలిసికొనుట అసంభవమనికూడా నుడువుచున్నది. జగత్తు ఎటుల పుట్టిననేమి, యెటుల గిట్టిననేమి, అందు పడి పరిభ్రమించు చున్న నీ సంగతి ముందు చూచుకో. తెలిసికొమ్మని మాత్రము గట్టిగా శ్రుతి స్మృతులు బోధించు చున్నవి. నీవెవరో నీసంగతి నీవు తెలిసికొనిన తదితరమంతయు సవిస్తారముగా దానంతట అదియే విశదమగును. బ్రహ్మాండములో నీవొక పిండమనుట వలన ఏకమృత్పిండ జ్ఞానమువలన సకల మృణ్మయ పాత్రలు మృణ్మయమనియే తెలియునట్లు నీ సంగతి తెలిసిన సర్వము తెలిసిన వాడవగుదువు.

బాలుని రోదనము మాన్పి సుఖముచేకూర్చుటయే ముఖ్యోద్దేశముగా గలిగిన దాది ఒకకట్టు కథను కల్పించి బాలునకు వినోదార్థము చెప్పుచు తృప్తిపరచు చుండును. దాని ముఖ్యోద్దేశము బాలుని సుఖమొక్కటే. అందులకు అనుగుణముగ వాని బుద్ధి ననుసరించి తృప్తిపరచుటకు ఒక కథను ఉపాయ భూతముగ తీసికొనినది. అటులనే అనాదిమాయా మోహితమైన అనేక జన్మసంస్కార వాసనాయుతులగు జీవులు ప్రత్యక్షముగా జగత్తును చూచుచూ అనుభవించుట వలన ఇదెట్లు సంభవించెనని అడుగక తీరదు. అట్టివారలకు ప్రతి ఉపశాంతి ప్రవచనములు పలుకకను తీరదు. ఈ స్మృతి పదవాక్యము లన్నియు తత్తుల్యములని గ్రహించవలయును. సృష్టి ఎట్లు కలిగినదను ప్రశ్నకు ఒక్కటే సమాధానము కలదు. కలలు ఎట్లు కలుగుచున్నవన్న ప్రశ్నకు జవాబు కుదిరినయెడల సృష్టి యెట్లు వచ్చెనను ప్రశ్నకును జవాబు వచ్చును. కలలు కనుటకు ఏది కారణమో జగత్సృష్టికి కూడా అదియే కారణము. నిద్రా శక్తి కలలను సృజించుచున్నది. మాయా శక్తి జగత్తును సృజించుచున్నది. అసత్యమగు కల క్రమము,నియతిలేక యెట్లు భాసిల్లునో అటులనే అసత్యమైన జగత్తు కూడా క్రమ రహితముగానే భాసిల్లుచున్నది. ఇదే అసలు అద్వైత సిద్ధాంతము. కనుపించు జగత్తు అంతయు కలవంటిదే, అను సిద్ధాంతమే అద్వైత సిద్ధాంతము. దీనినే అభేదవాదమని అందురు.

సృష్టి యెట్లు కలిగెను? అను ప్రశ్నవలె సర్వసామాన్యముగ నీకు అజ్ఞానము ఎట్లు కలిగెను? అను ఒకప్రశ్న కలదు. ఈ ప్రశ్నకు సమాధానముగా పూర్వమునందే వశిష్ఠమహర్షి రామచంద్రునకిట్లు చెప్పెను. రామా! ఈ అవిద్య ఎట్లు కలిగినదని విచారము పొందక "నేను దీని నెట్లు పోగొట్టుకొనగలుగుదును. అను విచారమే కలుగుగాక." ఈఉపదేశము రాముని కొక్కనికే కాదు జగత్తులో జన్మించిన మానవకోటి యావత్తునకు తెలుపుచున్న విషయము. మానవులకు కలుగుచున్న సంశయములు, ప్రశ్నలు విషయ యథార్థ జ్ఞానములేని కారణమున కలుగుచున్నవని నిశ్చయము. అనగా అజ్ఞానము వలన కలుగుచున్నవి. అట్టి అజ్ఞానము జీవుల నావరించి యున్నది. ఇది ప్రతివానికినీ స్వానుభవము. మనకు తెలియలేదని అనుటయే అజ్ఞానము, ఇక ప్రశ్నయేల? మనకు అజ్ఞానమున్నదని గ్రహించి తద్వారా సంక్రమించినట్టి సంసారములను దాని నాశ్రయించి యుండు జనన మరణ సుఖ దుఃఖాద్యనుభవము ఎటుల వదలునో అనుతాపత్రయమును వీడి అజ్ఞానమెటుల వచ్చెను? ఇది బ్రహ్మమునకు కలదా? లేక జీవునకా? అని బాధపడుట మరింత అజ్ఞానము. ఈ విచారము మాని అజ్ఞానమును పోగొట్టుకొనుటకు ఉపాయమేమని వెదకుట ఉత్తమము కదా. అజ్ఞానమను విషయము విచారణకు నిలువదు. విచారణ జ్ఞానజ్యోతి. అజ్ఞానము అంధకారము, జ్యోతి లేనంతవరకే అజ్ఞాన ప్రభావముండును.

# హేతువాద దృష్టిలో అవతారమూర్తి

హేతువాదీ (**Rationalist**) ఆధ్యాత్మికవాదీ (**Spiritualist**) ఏకగ్రీవంగా అంగీకరించే అంశమే లేదా ?- ఇది చమత్కారమైన చిక్కుప్రశ్న అనే చెప్పాలి. ఆధ్యాత్మికవేత్తలూ, వేదాంతులూ ఈ అంశాన్నిగురించి ఏంచెప్తుతారు?-అని ఆలోచిస్తే మనకు తెలియవచ్చే విషయం ఒకటి ఉంది. ఆధ్యాత్మికాచార్యుల, వేదాంతుల ఆలోచనలను ప్రవచనాలనూ కలుపుకొని సమాలోచిస్తే వారి దర్శనాలన్నీ అత్యున్నత స్థాయికి చెందిన హేతువాదంమీద ఆధారపడి ఉన్నాయని స్పష్టమౌతుంది. వారి జీవితాలనూ, జీవితవిధానాలనూ పరిశీలించినా, వారి త్యాగాలను భావించినా వారందరూ ఎంతో గాఢంగా సత్యాన్వేషణ చేసినవారుగా కనపడుతారు. అటువంటి జిజ్ఞాసువులు ఈ అంశంమీద ఏం చెప్పారో పరిశీలించాలని నాకనిపిస్తుంది. నేటి హేతువాదులు వారిని అహేతువాదులు (**Non - rationalist**) గా పిలుస్తారనుకుంటాను. అలాంటప్పుడు ఎవరికైనా ఒకటి అడగాలని అనిపిస్తుంది. ఏమంటే హేతువాదుల విశ్వాసమూ నాస్తికవాదుల విశ్వాసమూ ఒకటేనా ?- అని. ఆ రెండూ ఒకటే అయితే నాస్తిక వాదమంటే ఏమిటి ? నిజమైన నాస్తికుడుగా ఎవరిని పరిగణించాలి ?

ఆధునిక యుగంలో గొప్ప ఆధ్యాత్మిక వేత్త అయిన స్వామి వివేకానంద చెప్పిన మాటలను పేర్కొని ఈ అంశాన్ని వివరిస్తాను. ఆయన నాస్తికుణ్ణి ఇలా నిర్వచించాడు. 'దేవుణ్ణేకాదు జగత్తును కూడా 'నాస్తి' అనేవాడే నిజమైన నాస్తికుడు'. ఈ నిర్వచనం నిజంగా హేతుబద్ధమైంది. ప్రాచీన వేదాంతులకూ ఆధునిక హేతువాదులకూ నడుమ నిలిచే కొన్ని అడ్డంకులూ, అపోహలూ, అపార్థాలూ తొలగించటానికి ఈ నిర్వచనం తోడ్పడుతుంది. జగత్తును కాదంటే, దానిని దర్శించేవాణ్ణి అంటే ఆత్మనూ, అహంను, తదనుబంధాలైన అంశాల నన్నింటినీ కాదన్నట్లే. ద్రష్టనూ, అతని, ఇంద్రియాలూ మనోబుద్ధులూ దర్శించే విషయాలనూ కాదంటే ఇక మిగిలే దేమిటి ? సత్యం లేక (బ్రహ్మ, భగవంతుడు) మిగులుతుంది. అయితే సత్యమంటే ఏమిటి ?

సత్యం అనశ్వరమైనదీ, అనంతమైనదీ అని చెప్పబడింది. ఈ విశ్వంలో నశించనిదీ, అనంతమైనదీ ఏదీ ?- ఏదీలేదు పుట్టింది ప్రతిదీ గిట్టటము తథ్యం. ప్రతిదానికీ ఆదీ అంతమూ ఉంది. సూర్యుడూ నక్షత్రాలూ కూడా ఏనాడో ఒకనాడు అంతరించిపోయేవే. అయితే, అది కాలానికి సంబంధించిన ప్రశ్న. అయినప్పుడు-సత్యం లేదా భగవంతుడు-అంటే నిర్వచనమేమిటి ? ఆసత్యం-లేదా-భగవంతుడు లేదా పరమాత్మ-కాలాతీతం, ప్రపంచాతీతం, విశ్వాతీతం-ఆయిఉండాలి. మరొక రకంగా చెప్పాలంటే-నశించేది సత్యం కాదు.

నాస్తికవాదంలో ఆత్మ కూడా నశ్వరమైన ఒక భాగమే. నిజమైన నాస్తిక వాదమంటే జగదస్తిత్వాన్నీ, ఆత్మయొక్క అస్తిత్వాన్నీ అంగీకరించక

పోవటమే. అంటే అనాత్మవాదాన్ని అంగీకరించటమే. బౌద్ధంలో ఇదే ఉన్నది. ఆత్మ స్థానంలో పరమాత్మనుగాని, సత్యాన్నిగాని, భగవంతుణ్ణిగాని పత్యామ్నాయంగా గ్రహించటం జరుగుతుంది బౌద్ధంలో. అప్పుడు వేదాంతులు బుద్ధుణ్ణి నిజమైన హేతువాదిగా పరిగణించాలి. పై నిర్వచన పరిధిలోకి రాని హేతువాదులందరూ కపట హేతువాదులు కావాలి. అంతేకాదు; సత్యనైతికవర్తనంగల మానవుడే నిజమైన హేతువాదిగా పరిగణింపబడాలి.

'చూసినదాన్నే నమ్మా'లని దృఢంగా చెపుతారు నేటి హేతువాదులు. 'చూడటం నమ్మటం కా'దంటారు వేదాంతులు. చూడటమంటే జాగ్రదవస్థలో ఉన్న వ్యక్తి ఇంద్రియ వ్యాపారాన్ని సాధించటమన్నమాట. వేదాంతులు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను మూడింటిని పరస్పరాశ్రితాలుగా గుర్తిస్తారు. నాల్గవది సమాధ్యవస్థ. అది అతీంద్రియమూ, ఆధ్యాత్మికమూ అయిన జాగ్రదవస్థ. స్వప్నసుషుప్త్యవస్థలు జాగ్రదవస్థలో లయిస్తాయి; జాగ్రదవస్థ తదనుబంధానుభూతులు సమాధ్యవస్థలో లయమొందుతాయి. అటువంటప్పుడు నిజమైన హేతువాది- చూడటం, ఆలోచించటం, అద్భుత చర్యలను దివ్యమహిమలను వానిని ప్రదర్శించే వ్యక్తికి సంబంధించిన అంశాలను హేతువాదదృష్టితో వివేచించటం- వంటి అంశాలపట్ల అంత ప్రామాణిక భావాన్ని పచరించకూడదు.

ఇక్కడ మరొక అంశం గమనింపదగింది. అద్భుత చర్య లేదా దివ్యమహిమ అంటే ఏమిటి? పైన చెప్పిన తాత్పర్యాన్ని బట్టి మనం అందరమూ అద్భుత వ్యక్తులమే. ఈ సృష్టి ఈ విశ్వమూ- అంతా మన ఇంద్రియాలు దర్శించే ఒక అద్భుతం. దీన్నే మాయ అనీ మిథ్య అనీ అంటారు. అంటే అద్భుతాలన్నీ అసత్యాలూ అశాశ్వతాలూ అన్నమాట! కాని, నేటి హేతువాదులు ఒకవైపు అద్భుత వ్యక్తి (అవతారమూర్తి) యొక్క అస్తిత్వాన్ని స్థిరీకరించటానికి యత్నిస్తారు. మరొకవైపు అతని అద్భుత చర్యలను (దివ్యమహిమలను) కాదంటారు. ఇది అసందర్భం.

అన్నింటికీ ఆధారమైనది, వాస్తవమైనదీ సత్యమే. ఆ అనంత సత్యజ్ఞానం నుండి సముద్భవించే అఖండ శక్తి అనంత అద్భుతాలను సృజింపగలుగుతుంది కాని, అది ఒకవ్యక్తికి సాధ్యమయ్యే పనికాదు. అయితే, దీన్నిబట్టి అద్భుతవ్యక్తి - లేక - అవతారమూర్తి అద్భుదం కావటానికి వీలుందా? లేదు. ఎందుకంటే-అఖండ విశ్వసృష్టిలో ఉన్న అద్భుత శక్తిలోనిభాగమే అవతారమూర్తి ప్రదర్శించే అద్భుత మహిమ. జగత్తు మిథ్య అన్నంతవరకే ఈ అద్భుతాలూ మిథ్య. కానీ, విశ్వసృష్టిలోనూ, అవతారమూర్తిలోనూ ఉన్న అద్భుత శక్తికి వెనుకనున్నది ఒకే పరమసత్యం; అదే భగవంతుడు.

ఇప్పుడు మరో ప్రశ్న ఉదయిస్తుంది. అసలు అటువంటి అవతారమూర్తి ఉండటం సాధ్యమా?- అని. వేదాంతి సాధ్యమని గట్టిగా చెపుతాడు. ఎందుకంటే-అసత్తుకంటే సత్యం గురుతరమైనది. అటువంటి మహాత్ములు లేకుండా జగత్తు మనజాలదు. సామాన్యంగా లోకులు ఒక అనుమానాన్ని వ్యక్తం చేస్తుంటారు అవతారపురుషుని అద్భుత మహిమలను గురించి. అవతారమూర్తి లోకాన్ని మోహమగ్నం చేస్తున్నాడా? ఆయన మహిమలను వివరించటానికి మరే మార్గం లేదా?- అని. నిజమైన హేతువాదులుగా పేర్కొనదగిన మన వేదాంతుల దృష్టిలో-మనమంతా మోహమగ్నులమైన జీవులమే. ఆమోహం వల్లనే జాగ్రదవస్థ నిజమని నమ్ముతున్నాం; మనం

నశించిపోయేవారమనుకుంటున్నాం (నిజానికి మనం అమృతమూర్తులం), మనం పుట్టామనీ, చచ్చిపోతామనీ, స్త్రీలమనీ పురుషులమనీ ఎన్నో ఎన్నో అనుకుంటున్నాం; ఈ నశ్వరమైన జగత్తు సత్యమని భ్రమిస్తున్నాం. అవతారమూర్తి ప్రదర్శించే అద్భుత మహిమలు మనల్ని మనం జాగ్రదవస్థ అని అనుకుంటున్న స్వప్నావస్థనుండి మేలుకొల్పుతాయి; మనలోని మాయను మోహాన్ని తొలగించివేయటానికి తోడ్పడతాయి, మనం భగవత్సన్నిధానానికి – పరమసత్య సాక్షాత్కారానికి చేరటానికి సహాయపడతాయి. అందువల్ల అవతారపురుషుల దివ్యమహిమలు మానవోద్ధరణానికి అవసర మనటంలో అనుమానంలేదు.

యస్. సురేష్‌రావు
(పవర్ ప్రాజెక్ట్ ఇంజనీరింగ్ శాఖ
బొంబాయి).



# ఎంతో సంతోషం! బంగారూ!

క్రిందటి ఎండాకాలం మాట. మావారు, శ్రీపెటే, చెప్పారు–ఫిబ్రవరిలో న్యూఢిల్లీలో ఒక సైన్సు సమావేశం జరుగబోతున్నదనీ, అందులో ఆయన ఒక పేపర్ చదవబోతున్నారనీ. అంగీకారాలన్నీ అయినాయి కాని ఖర్చుల విషయం తేలలేదు. రానూపోనూ ఖర్చులు పెట్టుకోవాలంటే మాకు శక్తికి మించిన పని. ధన సహాయం కోసం మావారు ఇక్కడ, అమెరికాలో ఉన్న అనేక సంస్థలకు అప్లికేషన్లు పెట్టారు. కాని, ఎక్కడినుంచీ ఏ సహాయమూ అందలేదు. మేము ఆశలన్నీ దాదాపు వదలుకున్నాం. సమావేశం గడువు ఒక నెలరోజులే ఉంది. ఒక ఆదివారంనాడు నేను ధ్యానంలో కూర్చున్నాను. స్వామి దర్శనమిచ్చారు. నా హృదయం ఆనందంతో పొంగిపోయింది. నాలుగేళ్ల తరువాత మళ్లీ ఆ రోజు స్వామి నాకు దర్శనమిచ్చారు. అదే వారిచ్చే ఆశీర్వాదం; అభయహస్తం! మూడు రోజులు తిరిగే సరికి భారతదేశం నుంచి మాకొక కేబుల్ వచ్చింది. మావారి ప్రయాణపు ఖర్చులకు డబ్బు పంపబడింది. అప్పటికి మా ప్రయాణ సన్నాహానికి మూడు వారాలే మిగిలి ఉన్నాయి. అప్పటికీ, మా ప్రయాణానికి ఎన్నో అడ్డంకులు వచ్చాయి. కానీ, స్వామి దయవల్ల అవన్నీ మంచులా కరిగిపోయాయి.

ఎలాగైతేనేం విమానం మెక్కాం. విమానం బయలుదేరింది. 'అమ్మయ్య! అనుకున్నట్లు అన్నీ జరిగా'యని ఉప్పొంగిపోయాం. కాని, అంతలోనే మరో అంతరాయం. లాస్ ఏంజల్స్‌లో బయలుదేరిన మా విమానం దట్టమైన మంచు కారణంగా ఆలస్యం కావటంతో శాన్ ఫ్రాన్సిస్కో నుండి హాంకాంగ్ పోయే విమానం మాకందలేదు. కాని, అదృష్టవశాత్తు మాకు టోకియో పోయే విమానం అందింది. అదేంచిత్రమో, మాముందు వెనకల విమానాలు జనంతో కిటకిటలాడిపోతే, మేమెక్కిన విమానం మాత్రం ఎంతో ఖాళీగా బయలుదేరింది. ఏమైతేనేం, టోకియో చేరాం. అక్కడ ఒక రోజు ఉన్న తరువాత ఒక అర్ధరాత్రి పూట బయలుదేరిన విమానంలో సీట్లు దొరికి హాంకాంగ్ చేరుకున్నాం ఆనాడు చైనీయుల ఉగాది పండుగ కావటంతో

హాంకాంగుకు జనం తండోపతండాలుగా వెళుతున్నారు. విమానాశ్రయం జనసమ్మర్దంగా ఉంది. మేము చాలా సేపు పడిగాపులు కాయవలసివచ్చింది. నాకు కూర్చొని కూర్చొని విసుగెత్తి పోయింది. చెప్పలేనంత అలసి పోయాను; తూలి పడబోయాను. కడుపులో సంకటం మొదలైంది. పిల్లలు జ్ఞాపకానికి వచ్చారు. మేము బయలుదేరేటప్పుడు వాళ్లకు ఒంట్లో బాగాలేదు. అందులోనూ మా తొమ్మిదేళ్ల బాబు జెస్సీని తలుచుకొంటే నాకు బలే దిగులు వేసింది. వాడు తఱచుగా మంచాన పడుతుంటాడు. జ్వరం వస్తేచాలు ఊపిరాడని దగ్గు వాణ్ణి ఉక్కిరి బిక్కిరి చేస్తుంటుంది. మేము బయలు దేరే రోజు కూడా వాడు బాగా దగ్గుతున్నాడు.

చివర కెలాగైతేనేం హాంకాంగ్ చేరుకున్నాం; అక్కడినుంచి కొత్తఢిల్లీకి బయలుదేరాం. ఢిల్లీని సమీపిస్తున్న కొద్దీ నా గుండె నా మాతృభూమి స్మృతులతో కరగిపోయింది. 'నా కన్నతల్లి భారతమాత!' అనే భావం నాగుండె గొంతుకలో కదలాడింది. ఆ పవిత్ర భూమిని పావనం చేసిన మహర్షులు, మహాత్ములు నన్ను ఆశీర్వదిస్తున్నట్లు అమోఘమైన అనుభవం నాకు కలిగింది. కన్నుల్లోనించి అప్రయత్నంగా ఆనంద బాష్పాలు బుగ్గలమీదకు జాలువారాయి. కొద్దిసేపట్లోనే నా కన్నతల్లి చల్లని ఒడిలోకి వచ్చిచేరాను.

బెంగుళూరు చేరుకున్నాం. అక్కడ మావారి దగ్గర అమెరికాలో పూర్వం కార్యదర్శిగా పనిచేసిన ఒక స్నేహితుడి తల్లిగారున్నారు. ఆమె బాబా భక్తురాలు. బెంగుళూరు చేరుకోగానే ఆమెకు ఫోనుచేశాను. ఆమె పలికింది. ఆమెకు మేము రాసిన ఉత్తరం అందిందట! మారాకకోసం ఎదురు చూస్తున్నారట! "మీరు చాల అదృష్టవంతులు. స్వామి వైట్‌ఫీల్డ్‌కు మొన్ననే వచ్చారు. ఇప్పుడక్కడే ఉన్నారు' అని ఆప్యాయంగా చెప్పారు. ఆమాటలు వింటున్నప్పుడు నాకు కలిగిన సంతోషానికి అవధులులేవు.

హుటాహుటిగా బృందావనం చేరుకున్నాం. నేను ఆనందంతో ఊగిపోతున్నాను. ఆపవిత్ర భూమిని దర్శించే భాగ్యం కలిగినందుకు పొంగి పోతున్నాను. నా కలలను పండించిన ఆ పవిత్ర భూమిని తన్మయత్వంతో ముద్దు పెట్టుకొన్నాను. నాకు తెలుసు–ఆ నేల ఆ భగవానుని పాదపద్మాలు సంచరించే పుణ్యభూమి. అక్కడి దుమ్మును చేతితో తీసికొని గుండెకు హత్తుకున్నాను; తలమీద చల్లుకున్నాను. నేనప్పుడు నా కళ్లతో చూస్తున్న దృశ్యమంతా నేను స్వప్నాల్లో దర్శించిందే. అచ్చంగా అదే! ఆచెట్లు, ఆ పెండాల్, ఆ అందమైన ఎర్రనినేల; ఆభక్తకోటి! ఇలలో ఉన్నవే కలలో కనపడ్డాయి; కలలో చూచినవే ఇలలో ప్రత్యక్షమయ్యాయి! స్వామి దర్శనానికి వరుసలో ఒకచోట కూర్చున్నాం. అయిదు నిమిషాలయిందో కాలేదో స్వామి నివాసంలోనుంచి ఎవరోవచ్చి, మా పేర్లుపిలిచి, దర్శనానికి లోపలికి రమ్మని సూచించారు. నేను ఆశ్చర్యంతో నిశ్చేష్టురాలనైనాను; నాకు గుండె ఆగిపోతుందేమో ననిపించింది. స్వామి దయ మబ్బు లేని వాన అనిపించింది.

స్వామి దర్శనమిచ్చే హాలులోకి వెళ్లికూర్చున్నాం. మావారు మరి కొంతమంది భక్తులతో కలిసి కూర్చున్నారు. వారికి ఎదురుగ్గా మరో ప్రక్కన ఇద్దరు స్నేహితురాండ్రతో కలిసి నేను కూర్చున్నాను. స్వామి మధ్యద్వారం నుండి వస్తారేమోనని కన్నార్పకుండా అవైపు చూస్తున్నాం. ఇంతలో ప్రక్కగా తలుపు తెరిచిన చప్పుడయింది. స్వామి మా ప్రక్కనే ఉన్న ద్వారం నుండి విచ్చేశారు.

స్వామి సూర్యుడులా వెలిగిపోతున్నాడు. వర్చస్సు కాంతి కిరణాలను వెదజిమ్ముతోంది. మొట్ట మొదటి సారి స్వామిని ప్రత్యక్షంగాచూడటంఅదే. ఆ అమూల్యమైన క్షణం నాకందించిన మధురానుభూతి వర్ణనాతీతం దివ్యమందహాసంతో స్వామి సరాసరి నా దగ్గరికి.

వచ్చారు. వారి మధురధ్వని అప్యాయంగా నన్ను పలకరించింది. 'నీ భర్త ఎక్కడున్నాడు?' అన్న ప్రశ్న. వణకుతున్న చేతులతో స్వామికి పూలదండ సమర్పించుకొన్నాను. వారి దివ్య పాదపద్మాలను తాకి నమస్కరించుకొన్నాను. అప్పుడు మావారిని స్వామికి చూపించాను. స్వామి మావారివైపు వెళ్ళారు. ఆయన స్వామి పాదాలకు నమస్కరించారు. స్వామి ఆయన భుజంమీద ఎన్నోసార్లు తట్టుతూ 'చాల సంతోషం బంగారూ! చాల సంతోషం బంగారూ!' అంటూ దివ్య ప్రేమను ఒలికించారు. అప్పుడు స్వామి మావారిని కూర్చోమని చెప్పి ఒక్క నిమిషంలో మళ్ళీ వస్తానన్నారు.

స్వామి ప్రక్కకు తిరిగి మళ్ళీ నాదగ్గరికివచ్చారు. మావారిని మాదగ్గరికి రమ్మని పిలిచారు. వారువచ్చారు. అనుక్షణం మమ్మల్ని అనుగ్రహిస్తున్నట్లుగా ఉన్న స్వామితో మా గొడవలన్నీ మావారు మనవి చేసికొన్నారు. అన్నీ విని స్వామి అభయ హస్తమిచ్చారు. ఆతరువాత నేను మా పిల్లల ఫోటోలను స్వామికి చూపాను. 'అవునవును, నాకు తెలుసు' అన్నారు స్వామి. మావాడు జెస్సీ తరచుగా జబ్బున పడుతుంటాడని స్వామికి విన్నవించుకొన్నాను, స్వామి- విచారించకు బంగారూ! అన్నీ నేను చూచుకుంటాను' అని అంటూ 'నేను ప్రసాద మిస్తాను' అని అప్యాయంగా పలికారు. ప్రసాదం కోసం మరి రెండువారాలు ఆగాలనే భావం ధ్వనించేటట్లు కాటోలు-వెంటనే విభూతిని సృష్టించి నాచేతుల్లోనూ, మావారి చేతుల్లోనూ, మా స్నేహితురాంధ్ర చేతుల్లోనూ ఉంచారు. 'తినండి- తినండి' అన్నారు. చిన్నపిల్లలు వెన్నను నాక్కుంటూ తిన్నట్లు ఆదివ్యవిభూతిని చప్పరించాము.

ఆ తరువాత స్వామి విభూతి పొట్లాలున్న ఒక సంచిని తీసికొని మాదోసిళ్లు పొరలిపోయేటట్లు విభూతి పొట్లాలను అందించారు. ఆపైన మావారికీ, నాకు స్వామి ఆటోగ్రాపు లిచ్చారు. వారు నాకు ఆటోగ్రా ఫిస్తున్నప్పుడు, నేను వంగి భగవాన్ పవిత్ర పాద పద్మాలను ముద్దు పెట్టుకున్నాను. ఆరుసంవత్సరాలుగా ఆదివ్యానుభూతి కోసం నేను ఎదురు చూస్తున్నాను ఆ అమృత క్షణంలో నాకది అందివచ్చింది. నేను ధన్యురాలనైనాను. 'చాలసంతోషం' 'చాలసంతోషం' అని స్వామి ఎన్నోసార్లు అన్నారు. మావారిని 'బంగారూ' 'బంగారూ' అని అప్యాయంగా ఎన్నోసార్లు లాలించారు. 'సుఖంగా ఉండండి' అని మా దంపతులను దీవించి, భక్తులకు దర్శన మివ్వటానికి స్వామి ముందుకు కదలి వెళ్ళారు.

ఆ మరునాడు మావారు బెంగుళూరులోని కొందరు మిత్రులను కలిసినప్పుడు వారు ఆయన్ను తమతో కలిసి పనిచేయవలసిందిగా కోరారు. అదీ స్వామి దయయే. మిత్రులను కలియటానికి పోవటంతో ఆ రోజు వారికి స్వామి దర్శనం కాలేదు. ఆ మరునాడు మావారు అధ్యాపక బాధ్యతలను స్వీకరించటానికి ఢిల్లీకి పోవలసి వచ్చింది. ఆ రోజు ఉదయం మావారు స్వామిని దర్శించి పోవాలనుకున్నారు. కానీ, విమానయానశాఖవారు మావారి ఫ్లైట్ టైమింగ్స్ తప్పుగా గుర్తించటంతో వెంటనే వెళ్ళిపోవలసి వచ్చింది. ప్రభాత దర్శనానికి పూర్వమే విమానంలో వెళ్ళిపోయారు.

ఇదంతా ఆలోచించి చూస్తే-మావారికి ఆ మొదటి నాడు మాత్రమే దర్శించుకోవటానికి అవకాశం ఉంటుందని స్వామికి తెలుసునన్నమాట! అందుకే ఆ రోజు వెంటనే పిలిపించి దివ్యదర్శనాన్ని ప్రసాదించారు. నేనాతరువాత రెండువారాలుండి ప్రతిరోజూ బృందావనంలో స్వామిని దర్శించుకొన్నాను. ఆ అనుభవం మరువలేనిది; మాటల కందనిది. స్వామి ఆద్వారంలో నుండి వచ్చే కమనీయ దృశ్యం, వారు మన చెంతగా నడిచిపోతుందే మనం పొందే భగవ

త్సన్నిధాన భాగ్యం, వారి దివ్యమంగళ విగ్రహాన్ని, దివ్యపాదపద్మాలనూ, అమృతమయమైన అభయ హస్తాన్నీ, మధురానందాన్ని అందించే వారి దివ్య కంఠాన్నీ కన్నప్పుడూ, విన్నప్పుడూ కలిగే ఆనందం వాచాతీతం. ఈ అపూర్వానుభూతిని ప్రసాదించిన ఆ భగవానునికి మనం ఎలా ధన్యవాదాలు చెప్పగలం! మనం చూచే ప్రతివస్తువులో ప్రతివ్యక్తిలో ఆస్వామిని దర్శింపగలగటమే మనం స్వామికి చెప్పే ధన్యవాదం! ఆశక్తిని నాకు ప్రసాదించుమని స్వామిని ఎల్లప్పుడూ వేడుకొంటాను. స్వామి దివ్యప్రేమోపదేశాన్ని ప్రత్యక్షంగా విని కరించగలిగిన మన జీవితాలు ఎంత ధన్యములో !!

శ్రీమతి పేటీ ఏంజల్
(మురళి)
పెసిఫిక్ పాలిసేడ్స్

# పాక్షిక విద

చెదలు సంగతి మనకందరికీ తెలుసు. అవి చూట్టానికి మొదట చాల అమాయకంగా ఉండి, అంత పట్టించుకోవలసిన అవసరం లేని కీటకాలుగా మనకు అనిపిస్తాయి. కాని, అవి క్షణాలమీద అధిక సంఖ్యలో అభివృద్ధి చెందుతాయి; చడీ చప్పుడూ లేకుండా కొయ్యచట్రాల నన్నింటినీ కొరికి వేస్తాయి; చివరకు మనం నివసించే ఇంటికే మోసం తెస్తాయి. వానిని చూస్తే మనం మట్టుపెడతాం. కాని, అవి మన జీవితానికొక గుణపాఠం చెపుతున్నాయి. అందువల్ల వానిని చంపినదాని కంటె వానిని బాగా గమనించి, మనకొక నీతి చెపుతున్నందుకు మెచ్చుకోవటం మేలనిపిస్తుంది !

త్రాగుడు, నల్లమందుల్లాంటివి వాడటం, జూదం, చౌర్యం – వంటి చెడ్డ అలవాట్లు, అభ్యాసాలూ ఎన్నో మారువేషాలతో మనషుల జీవితాల్లోనూ, సంఘ ప్రవర్తనలోనూ నిశ్శబ్దంగా ప్రవేశించి, ఎందరో నియమపరుల జీవితాలనూ, ఉత్తముల శీలాలనూ నాశనం చేస్తాయి. భారతదేశంలోని యువకులు పాశ్చాత్యసంస్కృతి వ్యామోహంలో పడి, దానికి దాసులై పోతున్నారు. వారు తమ విలువైన సంస్కృతి సంప్రదాయాలను తృణీకరిస్తున్నారు. పెద్దలయెడ గౌరవం, తల్లిదండ్రులను సేవించటం, ఆర్తులను దయతో చూడటం, వినయం, నిరాడంబరత్వం, సత్యనిష్ఠ, ఆత్మగౌరవం – అనే సద్గుణాలను విస్మరిస్తున్నారు. శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం వారిలో భౌతికమైన దృక్పథాన్ని పెంచి, సుఖజీవనం మీద మనసును కేంద్రీకరింపచేసి, అహంకారాన్ని అభివృద్ధి చేశాయి. ఈ విధమైన పరిణామం నిజంగా జాతి జీవనానికి ఒక పతనావస్థ అని చెప్పాలి. ఇటువంటిది మనదేశంలోనే కాదు ప్రపంచదేశాలన్నిట్లోనూ కనపడుతోంది. ఇది చాల విచారకరమైన విషయం.

ఈ విషాదస్థితికి మూలకారణం – మానవ వ్యక్తిత్వంలోని ఆధా నైతిక అంశాల పట్ల

శ్రద్ధవహించక పోవటమే. ఇప్పటి మానవుడు కుటుంబం, సమాజం, దేశం, విశ్వమానవసంఘం పట్ల తాను నిర్వహించవలసిన బాధ్యతలను గూర్చి పట్టించుకోవటంలేదు. అన్నింటికంటే అధికంగా తన అహంకారాన్నే ఆరాధిస్తున్నాడు. తన సాంకేతిక ప్రగతినీ, వ్యోమయాన సామర్థ్యాన్ని, కంప్యూటర్ల కళానైపుణ్యాన్ని, అణువిస్ఫోటనశక్తినీ చూచుకొని గర్విస్తున్నాడు. కాని, అతని జీవితంలోని రాజకీయ-ఆర్థికరంగాలను గమనిస్తే ఎన్నో అవకతవకలు! ఎన్నో సంఘర్షణలు! మనిషి ధనాశను, అహంకారాన్ని, మతరాజకీయవైషమ్యాలనూ అధిగమించలేకపోతున్నాడు. జాతి కుల వర్గ భేదాలపట్ల అతనికున్న విశ్వాసం ఉత్తమ ఆదర్శాలకు భంగం కలిగిస్తున్నది. విద్యావిధానంలో ఏర్పడిన అగమ్యగోచరస్థితి అవధులు దాటి పోయింది. మానవుడు తన పాశవిక ప్రవృత్తులను నియమించి మానవతా దృక్పథంవైపు పురోగమించటంలో ఇంకా విజయవంతం కాలేదు. అందువల్ల అతడు ప్రధానంగా పశువుగా, పాక్షికంగా మానవుడుగా ప్రవర్తిస్తూ హాస్యాస్పదుడౌతున్నాడు.

ఈనాడు, మానవుడు డబ్బును కూడబెట్టి, దానివల్ల కలిగే భోగాలను అనుభవించాలని వెర్రిగా ప్రాకులాడుతున్నాడు. అనుక్షణం విషయవాంఛాలోలుడై సుఖదుఃఖాల్లో ఊగిసలాడుతున్నాడు. జీవితాన్ని మృత్యువులాగా సంపదను సంతాపం నీడలా వెన్నాడుతుంటుంది. మాంసపు ముక్కను ముక్కున కరచుకొని ఎగిరే కాకిని, ఆకలిగొన్న మరోపదికాకులు వెన్నంటి వేధించి నట్లుగా భాగ్యవంతుణ్ణి బాధలు పలు తిప్పలు పెడతాయి. మానవుని ఆశలు అనుక్షణం ప్రతిచోట పెరిగిపోతున్నాయి. సమకాలీన నాగరకత ప్రపంచంలో నలుమూలలా భయాలమీద భయాలను దొంతరలుగా పేర్చుకొంటూ పోతుంది.

నిరాడంబరంగా జీవిస్తూ సమున్నతంగా ఆలోచించటం ప్రాచీన కాలంలో ఆదర్శంగా ఉండేది. ఆధునిక కాలంలో అది తారుమారైంది. ఆధునిక భారతదేశంలో స్వల్పంగా ఆలోచించటం, ఆడంబరంగా జీవించటం అలవాటయింది. ఈ పతనానికి చాలవరకు కారణం నేటి విద్యావిధానమని నిందించక తప్పదు. భారతీయ సంస్కృతిని ప్రకాశింపజేసే సార్వకాలికమైన ఆధ్యాత్మికపు విలువలను మహాత్మా గాంధీ దర్శించారు. ఆ విలువలకు ఆయన ప్రారంభించిన ప్రాథమిక విద్యాసంస్థల ద్వారా పరిపోషింపజేయటానికి ప్రయత్నించాడు. ఆయన కారాగారంలో ఉన్నప్పుడు ఒక ఆంగ్లాధికారి ఆయనను తరచుగా దర్శిస్తుండేవాడు. ఆ అధికారి ఒకసారి గాంధీజీని ఇలా అడిగాడు – ఈవేళ మీరెందుకో విషాదంగానూ, విచారంగానూ ఉన్నారు. కారణం చెపుతారా? అని. గాంధీగారిలా సమాధానం చెప్పారు. "ఈ రోజుల్లో చదువుకోనివాడి కంటే చదువుకొన్నవాడే కఠినాత్ముడుగా కనపడుతున్నాడు. ఇది నిజంగా జరగ గూడని పని. ఈ పద్ధతి చాల ప్రమాదకరమైనది! ఈ భావమే గాంధీగారిచేత భారతీయ ఆదర్శాలను ప్రాథమిక పాఠశాలల్లో చదివే బాలబాలికల లేత మనస్సుల్లో వ్యాపింపచేయాలన్న ప్రయోగాలను చేయించింది. పైన చెప్పిన ఆంగ్లాధికారి మరోసారి బాలగంగాధరతిలక్‌ను కలిసి "పాశ్చాత్య విద్యావిధానం చదువుకున్నవాళ్ళను కఠినాత్ములుగా చేసిందని" గాంధీగారు చేసిన విమర్శను గూర్చి చెప్పాడు. అంతటితో ఆగక ఆయనిన్నిలా ప్రశ్నించాడు–"మీరూ పాశ్చాత్య విద్యావిధానంలో చదువుకొన్నారు కదా! కాని, దానివల్ల మీరు పాడైపోయినట్లు నాకనిపించలేదు. మరి ఇదేంటి?"– అని, తిలక్ ఇలా సమాధానం చెప్పాడు– 'నేను సాగవలసిన విద్యావిధానంలో చదువు కొనసాగిస్తూనే నన్ను నేను నిలదొక్కుకొన్నాను, అని.

ఈనాడు, మానవుడు 'కర్తవ్యము' 'కర్తవ్యము' అని అనుక్షణం, అనుదినం అంటూనే ఉన్నాడు. కాని ఆమాటకు, అర్థం స్పష్టంగా తెలియదతనికి కర్తవ్యం అనేది 'నీవూ—మరొకడూ' అనే ఇద్దరు ఉన్నప్పుడే కలుగుతుంది. ఒక వ్యక్తి సమాజంపట్ల చేయవలసిన కర్తవ్యమేమిటి? విశ్వశ్రేయస్సును సాధించటానికి అతడు తన అహంకారాన్ని ఎలా నిగ్రహించుకోవాలి?- అన్న అంశాలను బోధించకపోవటంచేత నేటి విద్యా విధానం తన ప్రయోజనాల్ని కోల్పోయింది. ప్రతి వ్యక్తికీ స్వాతంత్ర్యం ఉంది. ఒకడు తన స్వాతంత్ర్యాన్ని ఎదుటివాని స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లకుండా ప్రదర్శించుకోవచ్చు ఎదుటివాని స్వాతంత్ర్యాన్ని గౌరవించటమే నీ కర్తవ్యం. 'హక్కు' 'కర్తవ్యం' ఈ రెండూ ప్రాథమికమైనవి. ఇది ఇలా ఉండగా-ప్రతివాడూ తన సొంత హక్కులను గూర్చి గట్టిగా వాదించటం, వానిని సాధించుకోవటానికి ప్రాకులాడటమే లోకంలో ఎక్కువగా కనపడుతున్నది కాని ఇతరులహక్కులను గురించి సౌజన్యంతో సంభావించటం, ఆలోచించటంలేదు. ఇటువంటి నిర్లక్ష్యంతో కూడిన నిర్దాక్షిణ్యంవల్ల సమాజంలో మనచుట్టూ నివసిస్తున్న లక్షలాది సోదర ప్రజానీకం అపకారానికి, అన్యాయానికి గురికావటం మనం కళ్లారాచూస్తున్నాము.

భారతదేశంలో నేడు ఐదులక్షల గ్రామాలలో ప్రజలు బీదరికంతోనూ అజ్ఞానంతోనూ, అనారోగ్యంతోనూ బాధపడుతూ బ్రతుకు సాగిస్తున్నారు. ప్రభుత్వాలను ఏర్పరుస్తున్న పాలకులు వారి జీవన ప్రమాణాలను మెరుగుపరచటానికి ఎన్నో రకాలైన ప్రణాళికలను వేస్తున్నారు. అయితే, అంతా వారికే వదలి ఊరుకోవటం తప్పు. అది ప్రభుత్వ ప్రయత్నాల వల్ల మాత్రమే సాధింపబడే పనికాదు. గ్రామస్థుల హృదయపూర్వకమైన సహకారం, సహాయం, సుహృద్భావం ముఖ్యంగా దానికి కావాలి. ఒక పూవెప్పుడు ఒక దండకాలేదు. అలాగే ఒక వ్యక్తి ఎప్పుడూ తరతరాలుగా వస్తున్న తప్పులను సరిదిద్దలేడు.

కోట్లాది బాలలు వీధుల్లో బిచ్చమెత్తుకొని బ్రతుకులను బరువుగా లాగుతున్నారు. వాళ్ళ నా స్థితినుండి ఉద్ధరించి స్వయం పోషకంగా, ఆత్మగౌరవంతో నిలబడే పౌరులుగా రూపొందించవలసిన గురుతరమైన బాధ్యత పెద్దలమీద ఉంది. పెద్దవారు పెరిగిన చెట్లవంటివారు. వారిని ఏవైపుకు కావాలంటే ఆవైపుకు వంచటానికి వంగరు. అలా వంగటం వారికి మంచిదైనా దాన్నివారు చేయలేరు; మనం చేయలేము. కాని బాలలు లేత మొక్కలాంటివారు; వారిని సూటిగా, బలంగా పెరగటానికి తర్ఫీదు నివ్వవచ్చు. మంచికి అనుగుణంగా మలచవచ్చు. అందువల్ల భారతమాత బిడ్డలైన, వయోజనులైన స్త్రీ పురుషులందరూ పిల్లలపట్ల ప్రేమభావాన్ని ప్రచరించటం వారి ప్రథమ కర్తవ్యమని నేను ఉద్ఘాటిస్తున్నాను!

ప్రతి గ్రామంలోనూ ఒక ప్రాథమిక పాఠశాల, ఒక ఆరోగ్యకేంద్రం నెలకొల్పాలని నేను పిలుపునిస్తున్నాను. సంపద జీవితాన్ని భోగమయం చేయటానికీ, విషయ సుఖలాలసత్వాన్ని పెంచటానికీ కాదు. మంచి ఆరోగ్యాన్ని కలిగించే వాతావరణంతోనూ పిల్లల పరిస్థితులను అభివృద్ధి పరచవచ్చు. భారతదేశాన్ని మరలా ఒకసారి ప్రపంచానికి ఆదర్శ దృష్టాంతంగా చూపాలన్న సంకల్పం మీకుంటే దాన్ని గట్టి కృషితోనూ, కోర్కెలను క్రమంగా తగ్గించుకొనే నిగ్రహంతోనూ మాత్రమే మీరు సాధించగలరు.

అన్నపూర్ణ నెలసిన ఈ పవిత్ర భారతదేశంలో ప్రజలకు అన్నానికి లోటుండబోదు. జనాభాను నియంత్రించటం సరియైన తరుణోపాయం కాదు. ఎల

గంటే-పుట్టిన ప్రతి పాప తినటానికి పొట్టతోనే పుట్ట లేదు. పనిచేసి పొట్ట నింపుకోవటానికి రెండు చేతులతో పుట్టుతుంది. ఆ చేతులకు బలమివ్వాలి. నేర్పు నివ్వాలి; స్వయం పోషకత్వం సాధించే శిక్షణ నివ్వాలి. వాళ్ళెప్పుడూ బద్ధకస్థులూ, సోమరులూ కారాదు. అప్పుడు-తిండికొరత ఉండబోదు. ఆకలి సమస్య తలయెత్తబోదు.

బాలలు కర్మవీరులుగా రూపొందేటట్లు మనం వారిని ఉత్తేజపరచాలి; శిక్షణ ఇవ్వాలి. అందరిలో అంతర్యామియై వ్యాపించిన భగవంతుణ్ణి అరాధించటమే కర్మ అని తెలిపి దానికి జీవితాలను అంకితం చేసే టట్లు ప్రబోధించాలి. సేవాభావంతోనూ నేర్పుగా పాల్గొనేటట్లు తరిఫీదు నివ్వాలి.

ఈ ప్రయత్నంతో ప్రారంభింపబడే ప్రాథమిక విద్యాసంస్థలు విజయవంతంగా సాగటానికి, వాని నిర్వహణలో మనకు ఓర్పు, ప్రేమ ఎంతైనా అవ సరం. వేలకొద్ది రూపాయలు ఖర్చుపెట్టి భూములను కుదువపెట్టి, ఇళ్ళను అమ్మి తమ పిల్లలకు చదువులు చెప్పించటానికి సతమత మయ్యే తల్లిదండ్రులు చివ రకు వాళ్ళకు డిగ్రీలువస్తే సంతోషిస్తున్నారు. కాని, ఆ తరువాత ఆ డిగ్రీలు తమ పిల్లలకు ఉద్యోగభిక్ష కోసం ఆఫీసులచుట్టూ తిరగటానికి అర్హతగా ఇచ్చిన భిక్షాపాత్ర అని తెలిసికొని ఆ తల్లిదండ్రులు విచార పడుతున్నారు. విద్య సమాజావసరాలకోసం కృషి చేయటానికి ఏర్పడింది. దానికోసమే విద్యనేర్వాలి. ఇప్పటి చదువులో ఉద్యోగాలకోసం. చదువుకొన్న వారికి పనిచూపించటానికి వానిని కల్పించాలి. ఇక చదువుకొన్నవారి తలల్లో ఉన్న పరిజ్ఞానం పరిమితం; హృదయాలా కఠినం.

నూటికి ముప్పై మార్కులు వచ్చినా డిగ్రీలనిచ్చే స్తున్నాం. అంటే దాని అర్థమేమిటి ? అధికారులు వారికిచ్చే ప్రతి నూరు అంశాల్లోనూ డెబ్బై తప్పులు చేసినా పట్టభద్రుడు పనికివస్తాడని మనం ప్రకటిస్తున్నా మన్నమాట ! ఆత్మ విజ్ఞానంతో వెలుగొందే జీవితా లను సాగిస్తూ తల్లిదండ్రులు బిడ్డలకు మార్గదర్శకులు కావాలి. అప్పుడు-సంఘసేవా తత్పరులైన విద్యా ర్థుల తరం ఏర్పడుతుంది. ప్రతి విద్యార్థి సాటివ్యక్తిలో పరమాత్మ ప్రతిబింబాన్ని దర్శించగలడు !

(భగవాన్
బొంబాయి విశ్వవిద్యాలయం
కాన్వొకేషన్ హాలులో 18-5-1979
నా డిచ్చిన దివ్యోపన్యాసం నుండి)

# ఆప్తమిత్రుడు

బాలబాలికలతో కలిసిమెలిసి పని చేయటం ఉపాధ్యాయులకు ఎంతో ఆనందాన్ని ఇస్తుంది. అందుకే భగవాన్ వీరిని గురువులు అని అన్నారు. గురుశిష్యులు ఇరువురికి ఆనందాన్ని చేకూర్చటంతో పాటు బాలవికాస్ కార్యక్రమానికి ఒక నిర్ణీత గమ్యస్థానం, ఒక నిర్దిష్టమైన లక్ష్యంకూడా వున్నాయి. బాలవికాస్ కార్యక్రమ లక్ష్యాన్ని భగవాన్ స్వయంగా నిర్దేశించి స్పష్టపరచారు. విద్యయొక్క పరమావధి శీలము అని స్వామి ప్రకటించారు. శీల నిర్మాణమే విద్యా విధాన ప్రధానోద్దేశమని భగవాన్ స్వయంగా చెప్పినప్పుడు, బాలబాలికల ప్రవర్తనను తీర్చిదిద్దటంలో తల్లి తండ్రులతోడ్పాటు ముఖ్యమని విదితమవుతున్నది. గురువు తన శిష్యునికి బోధిస్తాడు. అతనిలోని శక్తిని ఉద్దీపింపచేస్తాడు. కాని బాలబాలికల స్వభావం, ప్రవర్తన, అలవాట్లు ఇంటిలోను, సమాజంలోను రూపుదిద్దుకొంటుంటాయి. సమాజం, ప్రపంచం మనకు అనుగుణంగా మారతాయనుకోరాదు. కానీ, మన కార్యక్రమానికి అనుకూలమైన పరిస్థితులను రూపొందించుకోవడంలో మన చుట్టుపట్ల కొంత కొంత మార్పును సాధించగలం. మన పరిసరాలను ప్రభావితం చేయగలం, తద్వారా మన కార్యరంగాన్ని విస్తరింపచేసికోవచ్చు. బాలవికాస్ పిల్లల గృహాలు వారి తల్లి తండ్రులు ఇట్టి నూతన ప్రపంచంలో చేరివుంటారు. తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రేమిస్తారు. బాలవికాస్ కార్యక్రమాలలో వానిని బోధించే గురువులలో విశ్వాసం కుదిరిన తల్లిదండ్రులు మనఃస్ఫూర్తిగా చేయూత నిచ్చిన సంఘటన లెన్నో ఉన్నాయి. పిల్లల ప్రస్తుత జీవితాలను భవిష్యత్తును తీర్చి దిద్దటం ఒకటే బాలవికాస్ లక్ష్యమని అంతకు మించి వేరు ఉద్దేశమేదీలేదని వారికి నమ్మిక కలగాలి.

భగవాన్ చేపట్టిన విద్యావిషయక కార్యక్రమంలో బాలబాలికలలో శీల నిర్మాణం అంటే అర్థం ఏమిటి? చిత్తశుద్ధి, నిర్మలమైన మనస్సు పవిత్రమైన హృదయం, మానసిక శక్తి, ప్రేమవంటి సద్గుణములను పెంపొందించటమే ఇక్కడ శీలమునకు తగిన అర్థము. పాపభీతి, దైవము పట్ల ప్రేమ మేళవించిన సరియైన విద్యాబోధన జరిగినప్పుడు బాలబాలికలలో ఇట్టి సత్ప్రవర్తన అనేది సహజ స్వభావంగానే విలసిల్లుతుంటుంది.

ఒక తప్పుడుపని చేసినప్పుడు జీవితంలో దాని ప్రభావం ఎలా వుంటుంది అనే విషయం బాలబాలికలకు అవగాహన అయినప్పుడు పాపపు పనులు చేయటానికి వారు తప్పక భయపడతారు. పాపపు పనులవల్ల జీవితంలో ఎంతో బాధపడవలసి వస్తుందని వారికి తెలియజెప్పాలి. ఈర్ష్య, ద్వేషం, దురాశ, వ్యామోహం, క్రోధం, గర్వం (అహంకారం) వంటి గుణములలో విపరీత భావనల ద్వారా పాపపు పనులు దుష్ఫలితం వ్యక్తమవుతుంటుంది. పాపపు కార్యమును మించిన ప్రమాదం లేదని గ్రహించాలి. పాప కార్యం చేయటంవల్ల కలిగే చెడుఫలితం అతని జీవితంలో తప్పక ప్రతిబింబిస్తుంది. బాల బాలికల మనస్సుకు ఈ విషయం పట్టినప్పుడు తాము చేసే

ప్రతి పనిని ఆలోచించి మరీ చేస్తారు. సంతోషము నకు పరమ శత్రువుల వంటి పై దుర్గుణములకు గురి కారాదని గుర్తిస్తారు. పాపము ఎంత హానికరమో గ్రహించిననాడు వారు చెడు నడతకు దిగజారరు.

తోటివారిని ప్రేమించినప్పుడే భగవంతుని ప్రేమ రుచి దొరుకుతుంది. పిల్లలకు (పెద్దలకు కూడా) మిత్రులందరికన్న ఆప్తమిత్రుడు భగవానుడు అందరి కన్న ఆత్మీయుడు, అత్యంత సన్నిహితుడు అయిన ఆ పరమాత్మ మనవాడు. ఆయనను మనం ప్రార్థించి నప్పుడు ఆయన మనవాడే అవుతాడు. పరమాత్మను ప్రేమించిన వారికి ఆయన అత్యంత ఆత్మీయుడు అవుతాడు. ప్రార్థించిన వారికి అనుక్షణం వెంట నంటివుంటాడు. ఏ హృదయం తనను ప్రార్థించునో, ప్రేమించునో ఆ హృదయమే భగవానునికి ఆలయము. మన హృదయవాసిగా అనుక్షణం కంటికి రెప్పలా దారి చూపుతూ మనలను ప్రేమించి రక్షిస్తూంటాడు. మనలను ఎన్నటికి వీడిపోని ఏకైక ధనం ఆ పర మాత్మ. నిరంతరము ఆ భగవానుని మనము పొందవచ్చు. మనలను వీడి ఎన్నడూ దూరము కాడు ఆ భగవానుడు, మన ప్రేమకు ప్రతిఫలంగా ఎన్నో రెట్లు అపారప్రేమను కురిపించే ఏకైక మిత్రుడు ఆ భగవానుడు ఒక్కడే భగవత్సం బంధమైన ప్రేమ భరిత కథలను, భగవంతుని సౌందర్య విలాసాన్ని, సర్వజ్ఞత్వాన్ని వివరించే కథ లను బాలబాలికలకు చెప్పాలి. ఆ పరమాత్మ అను క్షణం మనలను అంటి వున్నాడని వారికి బోధించాలి. పిల్లలు తమ ప్రార్థనలో మిత్రులు, ఆత్మీయులకన్న అత్యంత సన్నిహితుడు, ప్రేమ స్వరూపుడు అయిన భగవానునితో మాట్లాడవచ్చునని వారి మనస్సులకు హత్తుకొనేటట్లు చేయాలి. మన హృదయవాసి అయిన ఆ భగవంతుని పట్ల సహజ సిద్ధమైన ప్రేమను పిల్ల లలో పాదు కొల్పినపుడు, వారి జీవితాలు వికసించ నారంభిస్తాయి.

బాల వికాస్ పిల్లలకు బోధించే విద్య, సమగ్ర మైనదిగా నైతికమైన విలువలు పునాదులుగా కలిగి వుంటుంది. కేవలం పాఠశాల, పాఠ్యప్రణాళికకు నకలుగా ఉండదు. పిల్లల జీవితాలను తీర్చిదిద్దే ఉత్తమకేంద్రాలే పాఠశాలలు. బాల బాలికలలో సద్గుణ సంపదను, శీలాన్ని పెంపొందించడమే బాల వికాస్ కార్యక్రమంలోని సమగ్ర విద్యా విధాన లక్ష్యం. ఈ లక్ష్య సాధనలో తల్లిదండ్రుల చేయూత అవశ్యం వాంఛనీయమైనది. పిల్లల సుఖశాంతులకు వారిలోని ఆంతరంగిక దుర్గుణములే పరమ శత్రు వులు అవి వారి భవిష్యత్ జీవితానికి చీడపురుగులు. వానిని కనిపెట్టి ఆదిలోనే త్రుంచివేయాలి. పిల్లల ప్రవర్తన, గుణములలో ఇట్టి దుర్గుణములు తల ఎత్తకుండా జాగ్రత్తపడాలి. పిల్లలలో తలఎత్తే దుర్గుణాలను గురువే కనిపెట్టి ఉండాలంటే అనుక్షణం అది సాధ్యం కాదు. ఏమంటే గురువు, పిల్లలతో ఉండే సమయం పరిమితమైనది. వారి అధికారాలు కూడా పరిమితమైనవే. పిల్లలు తమ సమక్షంలో ఉన్నంతసేపు మాత్రం, వారు శ్రద్ధ వహించగలరు. ఆ తర్వాత బాధ్యత పెద్దలదే.

పిల్లలు సహజంగా ప్రేమ స్వరూపులు. కానీ వారిలో తలయెత్తే దుర్గుణాలవల్ల క్రమేణా పక్క దారులు పట్టటం జరుగుతుంటుంది. ఈర్ష్యాద్వేషాలు, ఆశాదురాశలు అహంకారమువంటి దుర్గుణాలు తొలుత వారిలో బీజరూపంలో వుండి క్రమేణా పెరిగి విష వృక్షాలుగా వేరితలలువేసి వారి జీవితాలనే నాశనం చేస్తాయి. ఇట్టి దుర్గుణాలకు కోరిక అనేదే పెద్ద బలంగా ఉంటుంటుంది. పిల్లలలో హానికరమైన దుర్గుణాలు కనిపించినవెంటనే తల్లిదండ్రులు తత్‌క్షణం జాగ్రత్తపడాలి. అట్టి బీజాలను అదిలోనే త్రుంచి వేయటానికి ప్రయత్నించాలి, పిల్లలలో ఏదైనా ఒక మంచి గుణం కనిపించినపుడు దానిని పెద్దలు ప్రోత్స

హించాలి. గురువులు, తల్లిదండ్రులు పరస్పర సహకారంతో ఈ బాధ్యతను నిర్వహించాలి.

పిల్లలలో అనుకరణ సహజంగా ఉంటుంది. పెద్దలు తమ గృహాలను ఆదర్శవంతంగా తీర్చి దిద్దుకొన్నప్పుడు ఆ ప్రభావం పిల్లలమీద పడి వారుకూడా ఆదర్శ పౌరులుగా రూపొందగల్గుతారు. పెద్దలను చూచే పిల్లలు ఎన్నో విషయాలు అనుకరిస్తుంటారు. దురదృష్ట వశాత్తు తల్లిదండ్రులందరూ ఈ సత్యాన్ని గుర్తించలేకపోతున్నారు. తమ పిల్లల నడవడిక గురించి శ్రద్ధవహించని తల్లిదండ్రులుకూడ ఎందరో ఉంటున్నారు. ఇట్టి సందర్భాలలో గురువుల బాధ్యత మరింత పెరుగుతున్నది.

పిల్లలు పెరిగేకొద్దీ వారిలో స్వయంశిక్షణ మాత్రమే తోడ్పడగలదు. పిల్లలలో స్వచ్ఛంద క్రమశిక్షణను పాదుకొల్పటమే బాలవికాస్ గురువుల ప్రధాన విధ్యుక్త ధర్మం. కర్తవ్యపాలన, భక్తి ప్రపత్తులు, క్రమశిక్షణ, శీల నిర్మాణమునకు అత్యంత ప్రధానమైనవని భగవాన్ పేర్కొన్నారు. ఈ సద్గుణములను పిల్లలలో పెంపొందించాలంటే తొలుత బాలవికాస్ గురువుల జీవితాలు ఆదర్శప్రాయం కావాలి. "నా జీవితమే నా సందేశం" అనేది ఉపాధ్యాయులకు మార్గదర్శకం కావాలని భగవాన్ నొక్కిచెప్పారు. ప్రతి ఉపాధ్యాయుని జీవితంలో భగవాన్ సందేశం ప్రతిబింబించినప్పుడే ఆశించిన లక్ష్యం నెరవేరుతుంది.

కర్తవ్యపాలనే ధర్మము. ధర్మబద్ధమైన జీవితమే సత్ప్రవర్తన అనిపించుకొంటుంది. "ఇతరులు నీపట్ల ఎట్లు ప్రవర్తించవలెనని నీవు ఆశించెదవో, నీవుకూడా ఇతరులపట్ల అట్లే ప్రవర్తించుము" అన్న జీసస్ సూక్తియే ధర్మబద్ధమైన జీవితమునకు గీటురాయి అని ఒక సందర్భంలో పేర్కొన్నారు.

భగవంతునిపట్ల ప్రేమనే భక్తి అంటారు. భగవంతుని గురించి ఆలోచించటం, ఆయననే నిరంతరం ధ్యానించటం, ఆయనతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకోవటం భక్తికి చిహ్నంగా ఉంటాయి. ఎవరిలో భక్తి పెంపొందుతుందో అట్టి వారిలో కర్తవ్యపాలన క్రమశిక్షణకూడ ఘటిల్లుతుంటాయి. ఈ మూడు సిద్ధించినప్పుడే బాలబాలికల జీవితాలు సద్గుణాలతో సంపన్నమై ఉత్తమంగా భాసిస్తాయి.

దీనినిబట్టి బాలవికాస్ ఉపాధ్యాయులు (పురుషులు గాని, స్త్రీలుగాని) తమ జీవితాంనే బాలలకు ఆదర్శప్రాయంగా ఉంచుకోవాలనే విషయం స్పష్టమౌతున్నది. బాలలలో దైవభక్తిని, స్వయం క్రమశిక్షణను పెంపొందించి జీసస్ ప్రవచించిన ఆదర్శ సూత్రాన్ని ఆచరణలో పెట్టేటట్లు బాలబాలికలను ప్రోత్సహించాలి. కథలద్వారా పిల్లల జీవితాలను తీర్చి దిద్దటమే బాలవికాస్ గురువుల కర్తవ్యం. వివిధ బాలవికాస్ కేంద్రాల పరస్పర సహకారం వల్ల ఇది మరింత మెరుగులు దిద్దుకోవాలి.

ఏసమస్యగాని భగవానుని చరణకమలముల చెంత ఉంచినప్పుడు, అదిపరిష్కారమై తీరుతుందనేసత్యాన్ని బాలవికాస్ గురువులు విస్మరించరాదు. భగవానుని చరణసన్నిధిలో శరణాగతి అన్ని సమస్యలకు ఏకైక పరిష్కారమార్గమని వారు గ్రహించాలి. సృష్టి, స్థితి, లయ కారకుడైన ఆ భగవానుడే మనకు శరణు. అహంకార భావములను విడనాడి, అత్యంత కృతజ్ఞతా భావముతో ఆ భగవానునిపట్ల శరణాగతిని అలవరచుకొన్నప్పుడు, అదే మనకు శాంతిని, ప్రేమను, శక్తిని ప్రసాదించగలదు. మనకు సమస్తము ప్రసాదించునది ఆ భగవానుడే. ఆభగవానుని పాదపద్మములే మనకు శరణ్యములు.

జాన్ హిస్లాప్

# ‘యోగ క్షేమం వహామ్యహం’

బాబాకు మరోసారి నా వినయపూర్వక ధన్య వాదాలు - ఎందుకంటారేమో - నా ప్రాణాలను కాపాడినందుకు, నా జీవితాన్ని రక్షించినందుకు, అండన నిలిచి అద్భుతంగా ఆదుకొన్నందుకు.

ఆనాటి అర్ధరాత్రి... ఒక స్నేహితుడింటినుండి కారులో తిరిగి వస్తున్నాను. కొండదారి: దిగుతవాటం ఖాంటాబర్పాఘాట్‌లో మిషన్‌రుయే దాటిన తర్వాత కొంత పైభాగం-బాగా ఇరుకైనరోడ్డు-కాళరాత్రి-దానికి తోడు వానజల్లు. నా ఎడంప్రక్క నానుకొనే అప్రతిహతమైన కొండరాళ్ళబారు కోటగోడలా ఉంది; కుడి ప్రక్కన పాతాళాన్నంటే లోతైన చీకటిలోయ. కారు బలే వేగంగా పోతోంది; ఆ జోరును తగ్గించాను. అయినా వేగంగానే పోతున్నది. ‘సూసైడ్‌కర్వ్’ (అపాయకరమైన రోడ్డువంపు) అని పేరెన్నికగన్న చోటును సమీపిస్తున్నాను. మరీ కొట్టుకుపోయేంత వానేమీ పడటంలేదు. బ్రేకులు వేయబోయాను: కారు టైర్లు రోడ్డుమీదజారాయి. బ్రేకులు గట్టిగా నొక్కాను. అవి పడలేదు. కారుకు బ్రేకులే లేనట్లయింది. ఆ తరువాత ఏం జరుగుతున్నదో......నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. పట్టుతప్పింది. క్షణంలో కారు వేగంగా కదిలిపోతోంది...నాలోని ప్రతి అణువూ హాహాకారం చేసింది-“బాబా” అని పొలికేక వేశాను.

కారు ఒరిగింది, జారింది, ఢీకొన్నది, దుమికింది,- కాని, పొర్లుకుంటూ పడలేదు. ఒక పెద్ద చెట్టుకొమ్మ పడటం కనపడింది. తల ఎగిరి పోయిందనుకొన్నాను, కాని కాస్తలో తప్పింది. ఆ కొమ్మ బలంగా కారు భాగాన్ని రాచుకొంటూ పడింది. ఆ గాఢాంధకార కూపంలో కారు మరికాస్త ఒరిగిపోయింది. కారు లైట్లు వెలుగుతున్నాయి. ఆ వెలుగులో ఒక పెద్దచెట్టు విరిగి కారుమీద పడుతున్నట్లు స్పష్టంగా తోచింది. ఆ పతనం ఎడమవైపు ప్రక్కవాటుగా జరగటంతో డ్రైవరు వైపుండే రెండుతలుపులూ బదాబదలైనాయి. అయితే, ఆ కుదుపుతో కారు కుడివైపు ఒరిగింది, జారింది. దానితో కారు ఒక చెట్టు మొదలుకూ, ఒక పెద్ద రాతికీ నడుమ ఇరుక్కొని పోయింది. ముందు అద్దాలు పెద్ద చప్పుడు చేస్తూ పగిలినట్లు వినపడింది, అయితే అద్దపుముక్కలన్నీ బైటికి పడిపోయాయి, లోపలున్న నా ముఖంమీద కొన్ని గాజుముక్కల పొడిమాత్రం పడింది. నేను బ్రతికే ఉన్న స్పృహను అది కలిగించింది. నాకేమీ అంగవైకల్యం కలిగినట్లు లేదు. కారు ఇంజనింకా ఆడుతూనే ఉంది. కుడి పక్కన టాంకునిండా గాస్‌ఉంది. అదృష్టవశాత్తు అది పేలలేదు.

నేను కారు మోటారు నాపాను. లైట్లులేవు. చుట్టూ పరిసరాలు ప్రశాంతంగా లేవు. రాత్రిచప్పుళ్ళు బాగా వినిపిస్తున్నాయి. క్రిందిభాగంలో మిషన్‌నది నీటి ఉరవడి చప్పుడు వినిపిస్తోంది. కప్పలు కీచురాళ్ళు చెవులు చిల్లులుపడేటట్లు రొద చేస్తున్నాయి. పదిలంగా నేను నాచేతుల్ని, కాళ్ళను, శరీరాన్ని కదిల్చాను. ఒడలంతా కుదుపిస్తూ వణికిపోతోంది. డ్రైవరువైపు తలుపులు తెరుచుకున్నాయి. బయటికి అడుగు పెడితే ఎక్కడపోయిపడతానో అని భయంవేసింది. అప్పు

డప్పుడూ కొద్దిగా జారుతున్నకారునుండి బైటికి రావాలని యత్నంకాని, కదిలితే ఏమౌతుందో, పాతాళంలో పడిపోతానో, అని భీతి. కంపించే గొంతుతో, జీర వోయిన ఎలుగుతో పెద్దగా మొరపెట్టాను. "ఓ! బాబా! బాబా! అంతా నా చేతులు దాటి పోయింది. నన్నేంచేస్తావో స్వామీ!" – అని నాకే తెలియకుండా అరిచాను.

అర్ధరాత్రిదాటి ఒకటి రెండు నిమిషాలు అయిందని డాష్ గడియారం చెపుతోంది, తప్పించుకోవటానికి ఏ ఉపాయమూ తోచటంలేదు; దిక్కూ త్రోవా తెలియటం లేదు; దిగుదామంటే పెద్దరాయి అడ్డముంది. దిగటానికి వీల్లేదు. కారుజారిపడిన రోడ్డుజాడ కనుచూపుకందటం లేదు. కారు ఎడంవైపుకు బాగా ఒరిగింది. చాల అసౌకర్యంగా ఉంది. నిల్చొదొక్కుకోటానికి, కారులో నా వస్తువులేమైనాయో అని చూచాను. అన్నీ లోపల చిందరవందరగా చెల్లాచెదరై ఉన్నాయి. కాళ్ళ చెప్పులు కూడా విడివడిపోయి ఎగుడుదిగుడుగా పడి ఉన్నాయి. కనుచూపుమేరలో ఎక్కడా నర సంచారం లేదు. నేనారోడ్డు చివరకు వచ్చినప్పుడా కొండ త్రోవలో కార్లేమీ లేవు. తెల్లవారేంత వరకూ ఆ అనిశ్చిత పరిస్థితిలో ఉండిపోవటంకంటే గత్యం తరం కనపడలేదు.

గడియారం 12 గం॥ 12 నిమిషాలు చూపిస్తోంది. అప్పుడు ఒక శక్తివంతమైన సర్చిలైట్ 45 డిగ్రీల వంపుతో నామీద పడింది. నేను జాగ్రత్తగా కుడి వైపున్న తలుపు దగ్గరికి జరిగి, అద్దాలుదింపి కిటికీ గుండా సహాయంకోసం అరిచాను. ఆ సర్చిలైట్ వెనుక కొన్ని మగ గొంతుకలు వినవచ్చాయి. నాకేక విని నేను దెబ్బలు తగలకుండా బ్రతికి ఉన్నానని గ్రహించి, తాము పోలీసు అఫీసర్లమనీ, అగ్నిమాపక రక్షక దళం త్వరలో వస్తున్నదనీ, తెలియచెప్పారు. సెక్యూరిటీ చైన్‌తో మొదట ఒకవ్యక్తి నావైపు దిగి రావటం గమనించాను. ఆ తరువాత మరోముగ్గురు అలాగే వచ్చారు. కప్పీల ద్వారా తాళ్ళకు కట్టబడ్డ డోలీని క్రిందకు దింపి నన్ను పైకి చేదుకొనే సరికి దాదాపు అరగంట పట్టింది. నన్ను వాళ్ళు రోడ్డుమీద నిలువబెట్టేసరికి నేను చెక్కు చెదరకుండా ఉన్నా నన్న సంగతి వాళ్ళతో పాటు నేనే నమ్మలేకపోయాను!

నన్ను వాళ్ళు ఇంటికి తీసికొని వస్తున్నప్పుడు ఆఫీసరును ఉండబట్టుకోలేక అడిగాను. 'నన్ను మీ రెలా చూడగలిగారు ? – అసలు నేనక్కడ ఉన్నానని మీ కెలా తెలిసింది–నన్నెందుకు వెతకవలసివచ్చింది. 'నాకు స్టేషన్ నుంచి 12 గం॥ 11 ని॥లకు రేడియో కాల్ వచ్చింది. ఎవరైనా ఈ విషయాన్ని అక్కడకు వచ్చి చెప్పి ఉండవచ్చు' అన్నాడు ఆఫీసరు. నా ప్రమాదాన్ని గురించి వర్తమానాన్ని అందించిన ఆ వ్యక్తికి మనసారా స్వయంగా కృతజ్ఞతలు చెప్పాలని ఎంతో కుతూహల పడ్డాను. మేము ఇంటికి చేరిన తర్వాత ఆ ఆఫీసరు కేంద్రకార్యాలయానికి ఫోను చేశాడు. ఫోనులో మాట్లాడి అతను తల ఊపుతూ అన్నాడు – "ఆకాశరామన్న పిలుపు" అన్నాడు. "మగా ఆడా?" అని నేనడిగాను. "చెప్పటం కష్టమని అక్కడినుంచి సమాధానం. 'ఇటువంటి సందర్భంలో ఎవరో ఆకాశరామన్న ఎందుకు ఫోనుచేస్తాడు?' అని ఉత్కంఠతో అడిగాను. ఆఫీసరన్నాడు – "నేనను కుంటా! ఇటువంటి విషయాల్లో చాలమంది చిక్కు కోటానికి ఇష్టపడరు" ఆఫీసరు బయలుదేరాడు అతని వెంట ముఖద్వారందాకా వెళ్ళాను. నాచెవుల్లో స్పష్టంగా ఏవో మాటలు మారుమ్రోగసాగాయి – "నేను నీలో చిక్కుకొన్నాను" "నేను నీలో చిక్కు కొన్నాను". (అంటే గీతలో అన్నట్లు యోగక్షేమం వహామ్యహం).

"ఓ బాబా! మీకు జీవితాంతం ఋణపడ్డాను. నిండు మనసుతో కృతజ్ఞత లివే అర్పిస్తున్నాను! మీరే ప్రయోజనంకోసం నన్ను ఎన్నుకొని రక్షించారో దానికి నూటికి నూరుపాళ్లు సహకరిస్తాను" అని వినమ్రుడ నయ్యాను.

ఆ భయంకర సన్నివేశాన్ని తలచుకున్నప్పుడల్లా నిద్రలో కూడా ఉలిక్కిపడి కంపించి పోయేవాణ్ణి, కాని, "నేను నీలో చిక్కుకొన్నాను" అన్న బాబా మాటలు మనసులో మెసలంగానే శాంతిని పొందేవాణ్ణి.

మకియల్ జె. ఎంజల్, శాంటాబర్బారా



# మానవ జీవిత ధ్యేయం

## మానవ అవస్థ

భగవంతుడు ప్రసాదించిన దివ్యదృష్టితో విశ్వ రూపాన్ని దర్శించిన అర్జునుని అవస్థను పోలివున్నది నేటి మానవుని అవస్థ. విశ్వరూప దర్శనంతో శ్రీ కృష్ణుడు అర్జునుని దృష్టికి కల్పించిన విశేష మేమంటే — త్రిదశాత్మకమైన రూపమే కాకుండా, నాలుగవ దశయైన (Fourth dimension) కాలాన్ని దర్శించే శక్తి, తీవ్రతరమైన కాలచక్ర పరిభ్రమణ వేగాన్ని అర్జునుడందులో చూడగలిగాడు. "హే ప్రభూ! శలభాలు మంటవైపు పరుగెత్తి అందులో పడి ఎలా నశించిపోతాయో—అలాగే నశ్వరమైన ఈ ప్రపంచం లోని వీరులందరూ నీజ్వాలాముఖాలలోనికి ప్రవేశించి లయించి పోతున్నారు" "ఓ మహాత్మా! అపూర్వమూ భయంకరమూ అయిన ఈ నీ విశ్వరూపాన్ని చూచి మూడు లోకాలూ భయంతో కంపించిపోతున్నాయి"— అని అర్జునుడు ఆక్రందించాడు. మార్పును గూర్చిన తీవ్రదాహంతో భవిష్యదాఘాతాన్ని ఎదుర్కొంటున్న నేటి మానవత స్థితి కూడా సరిగ్గా ఇలాగే ఉంది.

ప్రసిద్ధ వైద్య పరిశోధకుడు జోనస్ సాల్ (Jonas Salk) 'మాన్ అన్‌ఫోల్డింగ్' (మానవుడు వికసిస్తున్నాడు)అనే తన గ్రంథంలో ఇలా అంటాడు– "మానవుని భౌతిక పరిణామం తన సహజగతితో ముందుకు సాగుతున్నా—మానవుడు తన సాంస్కృతిక పరిణామ గతిని అత్యంత శీఘ్రతరం చేశాడు. దాని వల్ల భౌతిక-సాంస్కృతిక పరిణామ వికాస గతుల్లో కొట్టవచ్చినంత తేడా కనపడుతోంది" ప్రపంచంలో మార్పు సహజగతిలో సాగే విధానం నుంచి వైదొలగి, వేగంగా జరగటమే నేటి యుగ ధర్మమని మానవుడు భావించటంతో – పరిణామమే మానవుని ప్రధాన సమస్యగా నేడు మారింది.

విశ్వరూపాన్ని దర్శించి కంపించి పోయిన ముల్లోకం లాగానే అర్జునుడు కూడా భయవిహ్వలుడై భగవానుణ్ణి పూర్వ సౌమ్య రూపాన్ని దయతో చూపించమని ప్రాధేయపడతాడు. అణు బాంబు తయారీకి కారకుడైన ప్రసిద్ధ అణు భౌతిక శాస్త్రవేత్త ఓపెన్ హేమర్ (Oppenheimer) మొట్టమొదటి

అణుబాంబు పాటవ పరీక్షను పరికిస్తూ పలికిన పలుకులు, విశ్వరూప దర్శనం చేస్తూ పలికిన అర్జునుని మాటల్లా ఉండటంలో ఆశ్చర్యం లేదు. "ఆకాశంలో వేయిమంది సూర్యులు ఒక్కసారి వెలుగొందినప్పుడు కలిగే మహా ప్రకాశంకూడా సర్వశక్తిమంతుడైన భగవానుని దివ్యతేజస్సును సమీపించే శక్తిని కలిగి యుండటం కష్టం. అణువులో బంధింపబడిన అద్భుతమైన శక్తిలోని ఒక భాగం బహిర్గత మౌతున్న ఆ సమయంలో ఓపెన్ హేమర్ కూడా భయకంపితుడై ఉండాలి. అర్జునునకు భగవానుడిచ్చిన అభయ ప్రదానాల వంటి వానికోసం నేటి మానవత ఎదురు చూస్తోంది - "ఇటువంటి భయంకరమైన నా ఆకృతిని చూచి, అర్జునా! తత్తరపడబోకు, కలవరపడబోకు! నిర్భయంగా, ప్రసన్న చిత్తంతో నీ రథాన్ని తోలుతున్న నా రూపాన్ని మరలా దర్శించు".

ఆర్థర్ కోస్లర్ (Arthur Koestler) ఇలా అంటాడు- "మానవ మేధ సాధించిన శిఖరాల మహత్కార్యాలు-విజ్ఞాన శాస్త్రం, వట్టి ఆశలు చూపి వ్యామోహపరిచే దాని తీవ్ర పరాజయం-అని చెప్పాలి. Picodella Mirandola నుండి మనం చాలావరకు దిగజారిపోయాం. అంతే అది అంతాఏమిటో తెలిసికొనే జ్ఞానసంపుటం మాత్రం కాలేదు." ఆయన సంగ్రహపు వాక్యాలివి-"భౌతిక పరికరాలకుండే పరిమితుల దృష్ట్యా మన తాళపు బెజ్జాన్ని తొంగి చూచే సంభవాలుగా మార్పు మార్పుచేస్తున్నాయి. అయితే, మన పరిమిత దృక్పథాన్ని నిరోధపరిచే తాళపు బెజ్జంలోనుండి పూర్తిగా తీసే ప్రయత్నమైనా మనం చేయాలి" అని అన్నాడు కోస్లర్. ఆయన మానవుడూ అతని మెదడూ పొందిన పరిణామ వికాసాన్ని గూర్చి పరిశీలించారు. మానవునికి మూడు మెదళ్ళున్నాయని అంటారాయన. మొదటిది సరీసృప సంబంధమైనది. రెండవది-క్షీరదాలకు సంబంధించినది. మూడవది-నవ్యక్షీరద సంబంధమైనది. "మానవుని మేధయొక్క పరిణామ దశను గమనిస్తే దాన్ని సక్రమంగా ఉపయోగించటం చేతకాని జాతి మనది అని స్పష్టమౌతుంది. మెదడు యొక్క హేతువాద శక్తులను మనిషిలో పరంపరగా వచ్చే ప్రాచీన నిర్మాణాలవల్ల సరాల చైతన్యంలో కలిగే ప్రభావాలు అడ్డగిస్తుంటాయి. ప్రాచీన నవీన నిర్మాణ శక్తులమధ్య నున్న అసమగ్ర సమన్వయం మానవుని సహజావబోధస్థితిని, మేధాశక్తిని సక్రమస్థితిలో సాగనివ్వదు. వ్యక్తుల మధ్యా, జాతుల నడుమా సంస్కృతుల మధ్యా ఈ అంతరమైన ప్రత్యేక విభేదాలే పరస్పర సజాతీయ సంఘర్షణలకు మూలకారణాలౌతాయి. భాష ఈ వర్గాలమధ్య సంఘర్షణను మరింత పెంచింది, అడ్డుగోడలను విరివిగా నిలిపింది. మేధ మృత్యువును కనుగొనటం వల్లా, అంతరాత్మ దాన్ని త్రోసి రాజనటంవల్లా మానవుడు ద్వైధీభూతచేతస్కతకు ఉదాహరణంగా నిలిచాడు. ప్రకృతి మనలకు నిరాశ కల్పించింది; భగవంతుడు ఆయనను తెలిసికొనే వాణ్ణి బాట తప్పించాడు; కాలం అతీతంగా పరుగెత్తిపోతోంది"

## మానవ భాగ ధేయం

ఈ నేపథ్యాన్నిదృష్టిలో నుంచుకొని భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి అవతారము వారు ప్రముఖంగా ప్రబోధిస్తున్న ఆధ్యాత్మిక విప్లవము. దాని ప్రత్యేకతను మనం తప్పక అర్థంచేసికోవాలి. బ్లిడ్జ సంపాదకుడు కరంజియా కిచ్చిన సందేశంలో స్వామి ఇలా ప్రకటించారు-"ఇప్పటి మానవ సమాజం కొన్ని కొలది సంవత్సరాల సంతతపురోభివృద్ధి ప్రయత్న ఫలం ఈ అంతస్సృష్టికి మూలమైన సత్యాన్ని దర్శించుమనీ, ఆ సృష్టికర్తను ఆరాధించుమనీ, భక్తి, సమానత్వము, సేవా భావము అనే ఉత్తమ గుణాలను అవలంబించటం ద్వారా

తన హృదయాంతరాళంతో వెలుగొందే భగవదంశ పరిపూర్ణ విభూతితో ప్రకాశిత మౌతుందనీ, వేల కొలది మహర్షులూ, ప్రవక్తలూ, ఈ ప్రపంచంలో నలుమూలలా అనాదినుంచీ మానవునికి ప్రబోధిస్తూనే వస్తున్నారు. కాని, మానవుడు మాత్రం నేడు సమాజాన్ని సమగ్ర విలయస్థితికి తీసికొని వచ్చాడు. అతడు తన మేధనంతా ప్రపంచ వాతావరణాన్ని కలుషితం చేయటానికి ఉపయోగించాడు. అతడు పీల్చే గాలిని, జీవనాధారమైన నీటిని కలుషితంచేసి కొన్నాడు. స్వాతంత్ర్యానికీ, ముక్తికీ మూల సాధనమైన తన మనస్సును తనను బంధితుణ్ణి చేసే గొలుసుగా మార్చుకొన్నాడు. విద్యావిధానాలను, న్యాయసూత్రాలను, రాజకీయ పద్ధతులను, వ్యాపార సరళులను, విజ్ఞాన శాస్త్రఫలితాలను తనను అసూయా ద్వేషాలతో, కులవైషమ్యాలతో, జాతివైరుధ్యాలతో బంధింపచేసేటట్లు ఉపయోగించుకొన్నాడు. సమాచార సంబంధాలను వేగవంతంగా అభివృద్ధి చేసికొనే ప్రతి ప్రయత్నముతోనూ ప్రపంచం మరీ సన్నిహితమై పోతున్నది. కానీ, ఇరుగు పొరుగువారిని ప్రేమతో చూచే భావం మాత్రం సర్వత్రా మృగ్యమై పోతున్నది." ఈ మాటల్లో మహామేధావులందరూ చెప్పటానికి యత్నించిన పరమతాత్పర్యాన్ని బాబా సరళంగా సూటిగా ప్రతిపాదించారు.

మానవత కిప్పుడేర్పడిన ఈ ప్రమాద స్థితికి తరణోపాయం కావాలి. ప్రస్తుత ప్రపంచాన్ని పతనావస్థనుండి తప్పనిసరిగా ఉచ్చదశకు తీసికొని పోవటంవల్లనే సమాజ రుగ్మత నయ మౌతుంది. అందుకు ప్రపంచ మానవత ఐక్యతా సూత్రంతో ఏకం కావాలి. మన విజ్ఞానం మానవుల మధ్య అడ్డుగోడలుగా నిలిచిన అన్ని అవరోధాలనూ జల్లెడ పట్టి తీసివేయాలి. ఎందువల్లనంటే-ఎటువంటి అవరోధాలు లేని విశ్వమానవ సమాజం మన ఏకైక లక్ష్యం కాబట్టి. ఉపగ్రహాలు ప్రపంచమంతటా దూరదర్శిని చిత్రాలను ప్రచారం చేసేటప్పుడు ఆ జన సమాచార ప్రసారవిధానాన్ని ఎవరు అరికట్టగలరు? ఇటువంటి సమయంలో మానవత మొట్టమొదటి సారి గుర్తించవలసిన విషయం ఒకటి ఉంది. ఇరుగు పొరుగు వారిని మన్నించటం, రాజ్యసీమలను మర్చిపోవటం, వర్ణభేదాలను విస్మరించటం, జాతివైషమ్యాలను సమయించటం, భాషా విభేదాలను ప్రక్కకు త్రోయటం-అనే పద్ధతులే నేటి సమాజానికి భద్రతను కలిగిస్తాయి. భేదదృష్టి ఇప్పటి యుగంలో చెల్లని నాణెం కావాలి. కాని, ఇప్పటి ప్రపంచంలో మనం కళ్ళారా చూస్తున్నదేమిటి? కాలదోషం పట్టిన-వ్యక్తి కేంద్రంగా ఆలోచించే మానసిక విధానం చేసే మృత్యుఘోష. అణుబాంబుయుగానికి పూర్వం ఉన్న కాలానికి పనికివచ్చే నియమనిబంధనాల జీవచ్ఛవ సంపుటీకరణం! అంతేకాదు - వివిధ వ్యవస్థలుగా రూపొందిన దేవాధిపత్య విధానం విచ్ఛిన్నమైన మానవతా శకలాలను నినాదాలతోనూ, సూత్రవాక్యాల తోనూ సమైక్యం చేయటానికి యత్నిస్తోంది. కానీ అవన్నీ జీవంలేని బీజాలు. వానిలోనుంచి మహా సత్యాలను సజీవంగా సముద్భవింప చేసే శక్తి అదృశ్యమైపోయింది.

ఇట్టి విషమపరిస్థితినుండి మానవతను విముక్తి చేయటానికి సాయి మానవరూపంలో అవతరించారు. నిరర్థక కర్మవిధివిధానాలతోనూ, నిర్జీవవ్యవస్థలతోనూ మానవుణ్ణి సత్యాన్ని చూడలేని గ్రుడ్డివానిగా మార్చి తమ ప్రచండ ప్రాభవాన్ని ప్రదర్శిస్తున్న వ్యవస్థిత మతసంస్థల బారినుండి నేటి మానవతకు విముక్తిని కల్పించటానికి బాబా అవతరించారు. 'మానవతయే మతం! అది ఒక్కటియే మతం!' అని ప్రపంచింపటానికి బాబా వచ్చారు. స్వామి ఇలా ప్రవచించారు - "వ్యక్తి, సమాజం విడదీయటానికి వీలులేనట్లుగా

అల్లుకొని పోయిన అంశాలు. ఆరెండింటికీ వెలుగు తప్పకకావాలి. వ్యక్తి నుండి ఆనందం తరంగాయమానంగా లేచి సమాజమనే సరస్సును నింపాలి. అందులో నుండి వాకలు కట్టి భగవత్కృపాసముద్రంలో లీనం కావాలి. సమాజమనేది వ్యక్తుల సమూహానికి పెట్టిన పేరే కాని, దానికి భౌతికమైన శరీరం లేదు. సమాజమనే భౌతికకాయాన్ని పోషించి సహాయపడే అంగాల వంటి వారు వ్యక్తులు." సమాజం నిర్వహించే పాత్రనుగురించి స్వామి ఇలా అన్నారు - "సమాజం వ్యక్తిని రూపుదిద్దుతుంది. అతడు అభివృద్ధి పొందటానికి తగిన అవకాశాన్ని కల్పిస్తుంది; అతడు అనుసరింపవలసిన ఆదర్శాలను ఏర్పరుస్తుంది. వ్యక్తి శక్తివంతుడై, ప్రజ్ఞావంతుడై, సేవాపరుడై సమర్థవంతుడైన కార్యశీలిఅయితే సమాజం లాభపడుతుంది. సమాజం తాను నిర్వహింపవలసిన పాత్రను గురించీ వినయంతోనూ విజ్ఞతతోనూ ఆ పాత్రను పరిశుద్ధంగా నిర్వహించవలసిన విధానాన్ని గురించీ తెలిసి వర్తిస్తే వ్యక్తి లాభపడతాడు".

ప్రపంచ పరివర్తనంలో అవతారపురుషుని పాత్ర స్వభావాలను గురించి బాబా - కరంజియా కిచ్చిన ఇంటర్వ్యూలో విశదీకరించారు. హిందూమతంలోని విశ్వజనీనమైన మూలసిద్ధాంతాన్ని బాబా బలపరచారు. వ్యక్తికర్మ సమాజకర్మతో కూడా ముడిపడి ఉంటుంది. ఈనాడు మనం మానవ సమాజమంతా ఒక్కటే అనే భావంతో ముందుకు సాగుతున్నాము. అందువల్ల - వ్యక్తికి సంబంధించిన కర్మ సర్వప్రపంచకర్మతో ముడిపడి ఉండక తప్పదు. కాబట్టి, మానవ భవితవ్యాన్ని రూపొందించాలంటే కర్మ సిద్ధాంతం ఆచరణంలో పెట్టటం తప్పక ప్రాతిపదికగా నిలుస్తుంది. భవితవ్యం అనేది విముక్తి సాధించ లేని ఒక ఇనుప గొలుసుబంధం కాదు. ఎందువల్లనంటే మానవుడు తన సహజమైన ఉచితానుచిత వివేకంతో తన భవితవ్యాన్ని తానే రూపొందించుకొంటాడు. ఈ విధమైన ప్రవృత్తియే సామూహికమైన కర్మకూ, సామూహికమైన భవితవ్యానికికూడా క్రమంగా దారి తీస్తుంది. అందువలన-ఒకదేశ భవితవ్యం-ఆ దేశంలోని వ్యక్తులు తమతమ భవితవ్యాలను మలచుకుంటూ, తత్ఫలంగా సమాజ భవితవ్యాన్ని తీర్చి దిద్దే విధం మీదనే ఆధారపడి ఉంటుంది. వ్యక్తి ఎంత అధికుడైనా, అల్పుడైనా అతడెన్నుకొనే కర్మ మార్గంలోని ఫలాన్ని పొందుతాడు. సామాన్యులు అధికార వ్యామోహానికి దాసులౌతారు. ఉత్తములు దాన్ని అధిగమిస్తారు. ప్రాపంచిక విషయ వాంఛల కతీతులుగా మనగలిగే ఏసమాజంలో అధికాధిక సంఖ్యలో ఉంటారో ఆ సమాజం తప్పకుండా ముందంజ వేస్తుంది. బాబా ఇటువంటి పాత్రను భారతదేశం నిర్వహించవలసి ఉందని ఇలా ప్రబోధించారు- "భారతదేశం శతాబ్దాల తరబడి ప్రపంచానికి ఐక్యత, శాంతి, సహనం అనే ఆదర్శాలను బోధిస్తూ వచ్చింది. ఈ ఆధ్యాత్మిక విప్లవాన్ని నిర్వహించటంలో ఇప్పుడు మరలా అటువంటి నాయకత్వాన్ని చేపట్టాలి."

"ఈ విప్లవం ప్రపంచంలో ఇంతవరకు మానవుడు ఎన్నడూ నిర్వహింపని శక్తిమంతమైనదీ, విశ్వవ్యాప్తమైనదీ అయిన విప్లవం. ఇది రాజకీయమైనది గాని, ఆర్థికమైనదిగాని, శాస్త్రవిజ్ఞాన సంబంధి అయినదికాని, సాంకేతిక పరమైనదికాని కాదు. కాని అంతకంటే గాఢమైనదీ, మౌలికమైనదీ. ఇప్పుడది మోసులెత్తుతోంది. అదే ఆధ్యాత్మిక విప్లవం. అది మానవుని అంతర్దృష్టికి పదునుతుంది. దాని వలన మానవుడు ఆత్మసత్యాన్ని దర్శింపగలుగుతాడు. దీని ప్రభావం తప్పకుండా మానవసంఘాలపై బడి వానిని అభ్యున్నత పథంలో నడిపిస్తుంది. మానవతను సాధక మహానదిగా పరివర్తనం చేస్తుంది. ఆ మహానది అనంతమైన దివ్య భాగధేయమనే మహాసముద్రం వైపు ప్రసన్నంగా ప్రవహిస్తుంది."

బ్లిట్జ్ పత్రికిచ్చిన ఇంటర్వ్యూలో బాబా తమ మత ప్రబోధంలో పాటించే విధానాన్ని గూర్చి వివరించి చెప్పారు. తమ దివ్య సంకల్ప శక్తిని వినియోగించి లౌకిక సమస్యలను అప్పటికప్పుడే తీర్చటంలో కలిగే అపాయాలను వివరించిన తరువాత బాబా ఇలా అన్నారు—"దీనికి ప్రతిగా తీసుకోవలసింది దీర్ఘకాలిక ప్రయోజనం గల ప్రణాళిక. అదే నిజంగా ప్రయోజనాత్మకమైంది. ఆ ప్రణాళిక ననుసరించి అవతార పురుషుడు ప్రజలకు నాయకత్వం వహించి వారు తమంతటతాము తమ చిత్త సంస్కారాలను ఉన్నత స్థానములకు తీసికొనివెళ్ళే ప్రయత్నం చేస్తాడు. దానివల్ల ప్రజలు ఆధ్యాత్మిక సూత్రాల ద్వారా సత్యాన్ని అవగాహనం చేసికోగలుగుతారు. అప్పుడు వారు ధర్మనిరతవర్తనులు కావటమే కాకుండా దృఢ నిశ్చయంతో సమాజాభివృద్ధికి పాటుపడగలుగుతారు. ప్రకృతికీ, కార్య కారణ సంబంధమైన కర్మ సిద్ధాంతానికీ, సంబంధమున్న సంగతి అప్పుడు వారు గుర్తిస్తారు. ప్రజలు తమ ఆధ్యాత్మిక శక్తులతో ఆత్మజ్ఞానాన్ని సాధించగలిగే స్థితికి పరివర్తనం చెంది ప్రకృతి వైపరీత్యాలకు సంబంధించిన కార్య కారణాలను కూడా పరివర్తింపచేయగల శక్తిని సంపాదిస్తారు. మీరు పేర్కొన్నట్లుగా—భూకంపాలు వరదలూ, వర్షాలు లేకపోవటం, కరువుకాటకాలూ, అంటువ్యాధులూ వంటి వైపరీత్యాలు కలుగకుండా ప్రకృతి శక్తులను నియమించగలిగే శక్తిసామర్థ్యాలను ప్రజలే సంపాదిస్తారు. కాబట్టి మానవుడు అహంకారాన్ని చంపుకొని నిరహంకారి కావాలి; ఆధ్యాత్మిక ప్రవృత్తిని పెంపొందించుకొని తనను తాను విస్మరించుకోవాలి. అప్పుడు కర్మ ఫల చక్ర పరిభ్రమణానికి అతడు అతీతుడు కాగలుగుతాడు; ప్రకృతిని శాసించగలుగుతాడు; ప్రకృతివైపరీత్యాలు కలుగకుండా చేయగలుగుతాడు. ఇటువంటిదే అవతార పురుషుడు చేసేపని నేను ప్రస్తుతం చేస్తున్న పని కూడా అదే."

వ్యక్తినీ సమాజాన్నీ పరివర్తింప చేయటంలో ఉపయోగించేది ప్రేమసూత్రం. "ప్రేమ నా సాధనం, నా వ్యాపారము. సామాజిక శాస్త్ర విషయంలోనూ, ఆర్థికశాస్త్ర విషయంలోనూ సాధించవలసినదంతా ప్రేమద్వారా సాధిస్తాను. అటు ధనవంతులూ, ఇటు పేదలూ – ఇద్దరుకూడా నా దగ్గరకు రాదలచుకొంటే సమానత్వమనే సూత్రాన్ని ఆశ్రయించే రావాలి. ఇప్పుడు సమాజంలో ఉన్న ఆర్థిక వర్గభేదాలను తొలగించి సహకారాత్మకమైన విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని సాధించటానికి సమన్వయాత్మక సాధనాలుగా వారిని నేను ఉపయోగిస్తాను."

పునఃపరికల్పనానికి వీలులేని మన ప్రకృతి సహజ సంపదల భవిష్యత్తును గూర్చి ఆర్థికవేత్తలు ప్రపంచ వ్యాప్తంగా ఆందోళనపడుతున్నారు. ఆ సంపద నూరు లేదా నాలుగువందల యేళ్ళకంటే ఎక్కువకాలం రాదని అంచనాలు వేస్తున్నారు. మానవుని సాంకేతిక అభివృద్ధివల్ల కల్పింపబడిన విపరీతపు కోరికలను తీర్చుకోవటానికోసం భూమిలోని సహజసంపదలను దుర్వ్యయం చేసే హక్కు తనకు లేదని నేటి మానవ సమాజం గుర్తిస్తున్నట్లు లేదు. ఈ సమస్యనుగూర్చి జోనస్ సాల్క్ (Jonas Salk) ఈ విధంగా పేర్కొన్నాడు — "కోరిక అనేది మానవుని సహజావబోధ స్థితినుండి పుట్టేశక్తి. అది మానవులను అనుభవించటానికీ, క్రొత్తవిషయాలను కనిపెట్టటానికీ అద్భుతాంశాలను పరిశోధించటానికీ పురికొల్పుతుంది. జ్ఞానమూ, జ్ఞాపకశక్తి మీద ఆధారపడిన వివేకం సద్భక్తిగా అనుకూలంగా వర్తిస్తుంది......ఈ పరస్పర విరుద్ధశక్తులు సంఘర్షణపడినప్పుడు మానవుడు [illegible]చుగా రణరంగంగా మారుతాడు...జీవితంలో ఎన్నో సందర్భాల్లో మనం ఎదుర్కొనే ముఖ్య సమస్య ఏమిటంటే—మనం ఏమి కోరుకుంటున్నామో మనకు తెలియకపోవటమే. ఇటువంటి సందర్భాల్లో వచ్చే

ఇబ్బందేమిటంటే-మనం కోరేదేదో మనకు తెలిసి కూడా దాన్ని సాధించలేకపోవటం. కోర్కె- వివేకం కంటె బలమైంది కాబట్టి మానవునికి తన కోర్కెను తెలిసికొని దాన్ని నియమించటం ఆవసరమూ, అతి ముఖ్యమూ అవుతుంది."

బాబా ఇలా అంటారు—విశ్వమానవ సమానత్వం, సమసమాజ నిర్మాణానికి సంబంధించిన సిద్ధాంతాలు మొదలైనవి నేటి సమాజంలో సంపదను, ఆస్తులను సమానంగా పంపిణీచేసి సమానత్వాన్ని సాధించటంలో విజయవంతం కాలేకపోయాయి. ఇందులో ఉన్న అసలు ఇబ్బంది ఏమిటంటే—నీవు సంపదను కాని, ఆస్తినిగాని ప్రభుత్వచట్టాలద్వారా అందరికీ సమంగా పంచిపెట్టవచ్చును కాని, ప్రజలకోర్కెలలో సమానత్వాన్ని ప్రభుత్వచట్టాలద్వారా కల్పించగలవా? ఇది సాధించాలంటే ఆత్మజ్ఞానంతో కూడుకొన్న అనుకంప కావాలి. బాబాగారు తమ ముగింపు మాటల్లో ఈనాడు మానవత ఎదుర్కొంటున్న నిజమైన సవాలును గూర్చి స్పష్టంచేశారు. "ఈ పరిస్థితుల్లో మనం నిష్కామమైన జీవితాన్ని నడపటానికి ప్రాధాన్య మివ్వాలి. అటువంటి జీవితంలో మానవుని కోర్కెలు ప్రాథమిక అవసరాలకు మాత్రమే పరిమితమై ఉంటాయి. అది ఒక్కటే ఇప్పుడు తరణోపాయం. సాంఘిక ఆర్థిక పరిస్థితులను సమానస్థితిలో ఉంచటానికి అది ఒక్కటియే సాధ్యమైన పద్ధతి. నీ కామనలను అణచివేసికో! కోర్కెలను తగ్గించుకో! పవిత్ర ఆధ్యాత్మిక జీవితాన్ని సాగించు! అప్పుడు ప్రకృతిలో లభ్యమయ్యే సాధనసంపత్తి మానవాళికి సరిపోతుంది. దానివలన ఇంతకంటే మించిన మరో లాభముంది. పరస్పరం పోటీలు పడుతున్న సాంఘిక ఆర్థిక వ్యవస్థలు కల్పించే సంఘర్షణలు సమసిపోతాయి. మానసిక శాంతి పునరుద్ధరింపబడుతుంది.'

బాబా ఇస్తున్న సలహాను అర్థం చేసికొని పాటిస్తే మానవునికి ఇది సాధ్యమే. "ఆత్మదర్శనాన్ని సాధించటానికి ప్రతి సామాజికవ్యక్తినీ సమర్థవంతునిగా చేయటం సంఘం సాధింపవలసిన నిజమైన కార్యం. సంఘంలోని స్త్రీ పురుషులను అనుబంధంతో ముడివేసి ఉంచేవి కుటుంబవ్యవస్థలూ, కులవ్యవస్థలూ, వర్గ వ్యవస్థలూ మొదలైనవి మాత్రమే కావు. వీని అన్నింటి కంటె మించిన సన్నిహితమైన బంధాలతో వారు ముడివేయబడి ఉన్నారు. విశ్వమానవులందరూ ఒకటే అనే భావమే నిజమైన అనుబంధం. "వసుధైక కుటుంబకమ్" – అని మన శాస్త్రాలు చెప్పినట్లు ప్రపంచమంతా ఒకటే కుటుంబం. "అందరిలో ఒకడుగా తనను భావించి జీవించినప్పుడే మానవుడు నిజంగా జీవిస్తాడు".

మానవుడు మాధవుడుగా మారటం, మానవత్వం నుండి దేవత్వానికి పయనించటం – అనేదే మానవ జీవితధ్యేయమని బాబాగారు ప్రవచించారు. బాబా స్వయంగా ప్రవచించినట్లుగా – వారు సూచించిన సాధనలో మానవుడు తన అంతరాత్మను అభ్యున్నత ఆధ్యాత్మిక పథంలో పరివర్తింపచేసికొన్నప్పుడే అది సాధ్యమౌతుంది. అందువల్ల – స్వామియే మనలను సంస్కరించటానికి అనువుగా మనం మనల్ని సమర్పించుకోవాలి. స్వామి సూక్తుల్లో మనం సంపూర్ణ విశ్వాసాన్ని ఉంచాలి – "విశ్వమానవ సౌభ్రాతృత్వంతో మానవాళిని ఏకైకకుటుంబంగా సమైక్య పరచాలన్న సమున్నత ప్రయోజనాన్ని సాధించటానికి సాయి అవతరించారు. అనంతవిశ్వానికి ఆధారమైన దైవత్వాన్ని దర్శింపచేయటానికి ప్రతిజీవిలో నున్న ఆత్మసత్యాన్ని సాక్షాత్కరింప చేసి, ప్రకాశింప చేయటానికే బాబా అవతరించారు. పశుత్వాన్ని పరిత్యజించి పరమాత్మతత్త్వమనే ధ్యేయాన్ని అందుకోవటానికి అనువుగా మనిషికీ మనిషికీ మధ్య అను

బంధాన్ని కల్పించే ఆధ్యాత్మిక సంప్రదాయాన్ని మానవులందరూ గుర్తించేటట్లుగా ప్రబోధించటానికి బాబా అవతరించారు." "నాసంకల్పం తప్పక కార్య రూపంతాలుస్తుంది; నాప్రణాళిక తప్పక విజయవంత మౌతుంది; నేను సత్యాన్ని. సత్యం ఎక్కడా వెనుకాడవలసిన పనిలేదు; ఎప్పుడూ భయపడవలసిన పనిలేదు; ఎవరికీ తల యొగ్గవలసిన అవసరం లేదు".

—డా॥ ఎం. వి. ఎన్. మూర్తి



## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఖర్చు |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హావార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 3. | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |
| 4. | జ్ఞానవాహిని | 1.00 | 0-10 |
| 5. | ప్రేమవాహిని | 1-00 | 0-10 |
| 6. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 8. | ఆత్మారామం | 5-00 | 0-50 |
| 9. | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 10. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 11. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-25 |
| 12. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 13. | మణిమాల | 2-00 | 0-15 |
| 14 | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 17. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, వి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | | | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసునందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

**B**(1) **పుస్తకములు** : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 288 వ పుటలో చూడండి )

## నీలో వున్న దివ్యశక్తిని గుర్తించి ఉత్తేజము పొందు

గుళ్లోకి వెళ్లి టెంకాయ పగలగొట్టినప్పుడు, మీ అహంకారమును బద్దలుకొట్టినట్లు అనుకోవాలి. దేవుడు కొబ్బరి ఆరగిస్తాడని కాదు. వివేకమనే ఒక్క దెబ్బతో అహంకారమును రెండు ముక్కలు చెయ్యటానికి అది సంకేతం. టెంకాయ మీది పీచు తీసినప్పుడే అది ఒక్క దెబ్బకు పగులుతుంది. అలాగే మనిషి తన హృదయం చుట్టూ పీచులాగా పట్టిన కామక్రోధాలు అసూయా తొలగించుకోవాలి.

మానవుడు మహాశక్తి సంపన్నుడు. దుర్వాసనల మూలాన దుర్బలుడు అవుతున్నాడు. మీలో వున్న దివ్యశక్తిని గుర్తించి ఉత్తేజం పొందండి. అప్పుడు మీకు మంచితనమూ త్యాగగుణమూ నిజాయితీ ఆప్యాయతా అలవడగలవు. మంచి మాటలు వినండి. మంచి దృశ్యాలు చూడండి. మంచి ఆలోచనలు చేయండి. మంచి పనులు ఆచరించండి. అప్పుడు దుష్ట ప్రవృత్తులన్నీ నిర్మూలమై పోతవి.

—బాబా